# ప్రవక్త (సఅసం) గారి ప్రార్థనలు

ఆధారం

హిస్నెహసీన్


సంకలనం:

మౌలానా

హాఫిజ్ ముహమ్మద్ తఖిఉద్దీన్. బి. ఏ.

తెలుగు అనువాదం:

ముహమ్మద్ అజీజుర్రహ్మాన్. బి. ఏ.

ప్రథమ ముద్రణ మే 1986.

ప్రతులు—2000

వెల రు: 8-00

ప్రకాశకులు:

మజ్లిసె ఇషాఅతె ఇస్లాం
ఉజాలెషా మస్జిదు దగ్గర
సయీదాబాద్.
హైదరాబాద్, - 500 659.

---

ముద్రణ: కిసాన్ ప్రెస్, అఫ్జల్ గంజ్, హైదరాబాదు

# విషయ సూచిక

# ముందు మాట

ధర్మ సంస్థాపనార్థం ప్రవక్తలు అన్ని కాలాల్లోనూ, అన్ని సమాజాలలోనూ ప్రభవింపబడ్డారు. వారిపై దైవ సందేశం అవతరించింది. సృష్టికర్తకు సేవించమని; తమ సత్సంప్రదాయాలను పాటించమని ప్రవక్తలు మానవాళిని కోరారు.

అంతిమ ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం)పై దైవ సందేశం అవతరణ సంపూర్తి అయింది. దివ్య ఖుర్ఆన్ ప్రళయదినం వరకు అందరికీ ఆచరణ యోగ్యమయిన సంవిధానం. అంతేకాదు, మానవాళి శ్రేయో సాఫల్యాలకు అది ఏకైక సాధనం కూడా. దివ్య ఖుర్ఆన్ మహోన్నత మయిన ఒక సిద్ధాంతమయితే, దాని ఆచరణకు మహత్తరమయిన ఆదర్శం మహా ప్రవక్త (స అసం) జీవితం.

ఇస్లాం అంటేనే ఆజ్ఞా బద్ధులయి ఉండటం, విధేయులయి ఉండటం అని అర్థం. దైవాజ్ఞలను నిర్వర్తించటం, ప్రవక్తల మార్గాన్ని అనుసరించటం అన్నది దీని పరమార్థం. ఇదే ఆరాధన. అంటే సేవించటం, దాస్యం చేయటం అన్న అర్థాలు కూడా వస్తాయి. ప్రభువు, పాలకుడు, పోషకుడు అయిన దేవుని ఔన్నత్యాన్ని, ఆయన గుణగణాలను కొనియాడుతూ దాసుడు తన అసమర్థతను, నిస్సహాయ స్థితిని వ్యక్తపరచటం ఆరాధన యొక్క ప్రధాన ఉద్దేశ్యం. తన దీనావస్థను, నిస్సహాయతను తెలుపుకుంటూ దాసుని నోటి ద్వారా వెలువడే పదాలే 'దుఆ' (ప్రార్థన) అనబడతాయి.

అందరికంటే ఎక్కువగా అల్లాహ్‌కు భయపడుతూ విధేయత కనబరచే దాసులలో మహా ప్రవక్త (సఅసం) ప్రథములు. అందుకనే ఆయన (సఅసం) అందరికంటే అధికంగా దైవాన్ని వేడుకునేవారు. ఆయన దుఆలు (ప్రార్థనలు) అసంఖ్యాకంగా ఉన్నాయి జీవితపు అన్ని దశల లోనూ, అన్ని ఘట్టాలలోనూ - ఉదయంనుండి సాయంత్రం వరకూ, సాయంత్రం మొదలుకొని ఉదయంవరకు — దైవాన్ని జ్ఞాపకంచేసే' ఆయన్ని అర్థించే రీతులను ఆయన (సఅసం) మనకు నేర్పారు. దాసుడే గనక ఉత్తమ రీతిలో తన నిజ ప్రభువును అన్ని విషయాల్లోనూ జ్ఞాపకం చేస్తే ఆయన తన దాసుని వైపుకు తప్పక మళ్ళుతాడు.

'దుఆ' నిజానికి ఆరాధనా సారం. ప్రభువు సన్నిధిలో ప్రార్థించే ముందు దాసుడు తన స్థోమతను-అర్హతను-దృష్టిలో ఉంచుకోవాలి. విశ్వాసంపై స్థిరంగా ఉంటూ, ధర్మ సమ్మతమయిన సంపాదనను మాత్రమే ఆర్జిస్తూ, అన్ని చెడుపనులనుండి తనను కాపాడుకుంటూ, సతతం దైవాజ్ఞా బద్ధుడై ఉండే దాసుని 'దుఆ' (ప్రార్థన) మాత్రమే దైవ సన్నిధిలో స్వీకరించబడుతుంది. ఇంకా, 'దుఆ' దాసుని హృదయపు లోతుల్లోనుండి బయటికి రావాలి.

'దుఆ'ల (ప్రార్థనల) గురించి ఉర్దూలో అనేక చిన్న పెద్దగ్రంథాలు వచ్చాయి. వాటిలో "హిస్నెహసీన్" ఎన్నదగిన గ్రంథం మా ఈ పుస్తకానికీ "హిస్నెహసీన్"నే ముఖ్యాధారంగా చేసుకున్నాము. ఈ దుఆలను సరైన ఉచ్చారణతో, అర్థం చేసుకుని మరీ కంఠస్థంచేసి దాని ఒక్కొక్క పదం ఒక్కొక్క వాక్యంపై చిత్త శుద్ధితో అమలు జరిపినట్లయితే నిశ్చయంగా అల్లాహ్ మన ప్రార్థనల్ని ఆమోదిస్తాడు.

నేను 'దుఆ'లను కేవలం సంకలనం మాత్రమే చేశాను. వీటి తెగులు

అనువాదం, కూర్పు తదితర విషయాలలో కష్టపడిన వారు ముహమ్మద్ అజీజుర్రహ్మాన్ గారే ఈ తెలుగు అనువాదాన్ని ఓపికతో పరిశీలించి, లోటు పాట్లను సరిదిద్దడంలో విలువయిన సమయాన్ని కేటాయించిన మౌలానా సయ్యిద్ నూరుల్లాహ్ ఖాద్రి గార్కి మా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాము

ఈ ప్రార్ధనా రీతులను ముస్లింలతో పాటు, ముస్లిమేతర సోదరులు కూడా అధ్యయనం చేసినట్లయితే వారు, ఇస్లాం ప్రకృతి ధర్మం అన్న యదార్థాన్ని గ్రహిస్తారని భావిస్తున్నాము.

పాఠశాలల్లో చదివే ముస్లిం బాలురు, బాలికలకు ఒక్కొక్క దుఆను అర్థం, భావంతోసహా కంఠస్థం చేయిస్తే వారు నిజమయిన ముస్లిం లుగా జీవితం గడుపుతారని ఆశించవచ్చు. ముఖ్యంగా ఈ పుస్తకాన్ని ధార్మిక విద్యాలయాల పాఠ్యాంశాలలో చేర్చాలి.

**ముహమ్మద్ తఖిఉద్దీన్**
(మజ్లిసె ఇషాఅతె ఇస్లాం ఉపాధ్యక్షులు. నూర్ హైస్కూల్ ప్రిన్సిపాల్, ఉజాలెషా మస్జిద ప్రసంగకర్త)

# నా మాట

తెలుగు లిపిలో 'దుఆ'లను ప్రచురించరెందుకు? పాఠకులు పదే పదే నన్నడిగిన ప్రశ్న ఇది. నిజమే. తెలుగు లిపిలో మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహివసల్లం)వారి ప్రార్థనలు ఇప్పటివరకు చాలా తక్కువ ప్రచురితమయ్యాయి. ఉదాహరణకు పంజ్ సూరా; "నమాజ్ కా తరీఖా" 'మస్నూన్ దుఆయే' ఇత్యాది పుస్తకాలలో కొన్ని 'దుఆలు' సేకరించి ప్రచురించారు ఈ కృషిలో పాలుపంచుకున్న వారందరితో అల్లాహ్ ప్రసన్నుడవుగాక!

అయితే ప్రవక్త(సఅసం)గారి ప్రార్థనల గని చాలా పెద్దది. అందలి ఒక్కొక్క చిన్న 'దుఆ' కూడా ముస్లిం సమగ్ర జీవన వ్యవస్థతో ముడిపడి ఉంది. సాధ్యమయినన్ని ఎక్కువ'దుఆ'లను సమీకరించి, అర్థం, భావంతో సహా వాటిని తెలుగు సోదరులకు సమర్పించాలన్న ఆకాంక్ష నాకు ఎంతో కాలంగాఉంది. గురువర్యులు మౌలానా ముహమ్మద్ తఖీఉద్దీన్ గారికి నా అభిప్రాయాన్ని తెలియజేశాను. ఆయన నన్ను కేవలం ప్రోత్సహించడమే కాదు-అనేక గ్రంథాలలోని 'ప్రార్థన'లను ఉర్దూలో సంకలనం చేసి యిచ్చారు. ప్రార్థన పరమార్థం ఏమిటి? ఎట్టి పరిస్థితుల్లో ప్రార్థన స్వీకార యోగ్యమవుతుంది? ఎవరి ప్రార్థనలు ప్రత్యేకంగా దైవ సాన్నిధ్యంలో స్వీకరించబడతాయి? మొదలగు అంశాలన్నీ ఈ గ్రంథంలో ఆధారాలతో సహా ప్రస్తావించటం జరిగింది.

తెలుగు లిపిలో 'దుఆలు' పొందుపరచటమన్నది అతి సున్నిత మయిన విషయం దీనికి ఎవరూ పూర్తి న్యాయం చేకూర్చలేరు. ఎంత శ్రద్ధ తీసుకున్నా ఏదో వెలితి ఉండనే ఉంటుంది. అందుకే కొన్ని ముఖ్యమయిన దుఆల "అరబీ మతన్"ని కూడా చివరి పేజీలలో పొందు పరచాలని నిర్ణయించాము. అరబీ భాషపై అపారమయిన అధికారంకల మౌలానా సయ్యిద్ నూరుల్లాహ్ ఖాద్రిగారిచేత ఎడిట్ చేయించిన మీదటే గ్రంథాన్ని అచ్చువేయించాము.నన్నాశీర్వదించి ఈ మహత్కార్యంలో ఎంతో విలువయిన సమయాన్ని కేటాయించిన మౌలానా నూరుల్లాహ్ ఖాద్రి గార్కి దైవం ఉత్తమ ప్రతిఫలం ప్రసాదించుగాక!

నా లాంటి అల్పునిచేత విశ్వ ప్రభువు ఈ పని చేయించుకుంటు న్నందుకు నాకెంతో ఆనందంగా ఉంది. క్షమార్హం కాని తప్పులు ఎక్కడ జరిగిపోతాయోనన్న భయం కూడా కలుగుతూ ఉంటూంది. దయాసాగరు డయిన అల్లాహ్ ఇందలి లోటుపాట్లను మన్నించి, ఈ చిరు కృషిని స్వీక రించాలని వేడుకొంటున్నాను.

—ముహమ్మద్ అజీజుర్రహ్మాన్

అనంత కరుణామయుడు అపారకృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో.

# దుఆ [ ప్రార్థన ]

## 'దుఆ' వాస్తవికత:-

'దుఆ' అంటే పిలవటం, మొరపెట్టుకోవటం, అడగటం అని అసలు అర్థం. అయితే ఇస్లామీయ పరిభాషలో 'దుఆ' అంటే, దేవుని సన్నిధానంలో వేడుకోవటం, విన్నవించుకోవటం, అర్థించటం అనే అర్థాలు వస్తాయి. అంటే మన దాస్యాన్ని, ఆరాధనను, అర్చనను, దీనావస్థను, అసమర్థతను నిస్సహాయతను దైవ సమక్షంలో వ్యక్త పరచటం అన్నమాట! విశ్వ ప్రభువు ఆధిపత్యాన్ని, ఆయన ఆలనా పాలనల్ని, ఆయన కరుణానుగ్రహాలను, ఆయన గొప్పదనాన్ని అంగీకరించి నిర్ధారించడమన్నమాట!!

మానవుడు సద్వర్తనుడయిన ఒక దాసుడుగా మారి, దేవుని గొప్పదనం, ఆయన సార్వభౌమత్వం పట్ల నిష్కల్మషమయిన విశ్వాసం కలిగి, ఆయన సన్నిధానంలో చేతులు చాచినపుడు 'దుఆ' (ప్రార్థన) యొక్క వాస్తవికత ఉనికిలోకి వస్తుంది.

మానవుడు ఒక్కొక్కప్పుడు తన ప్రభువును తన మనస్సుద్వారానే పిలుస్తాడు. అతని నాలుక కూడా అతని మనసుకు వంత పలుకుతుంది. ఒక్కోసారి అతను చేతులెత్తకుండానే దైవాన్ని అర్థిస్తాడు. కొన్ని సంద

ర్భాల్లోనయితే తన ప్రభువును సూటిగా అడిగేస్తాడు. అధరాలు వణికి పోతుండగా, కన్నీరుధారలై ప్రవహిస్తుండగా, ఎంతో వినయ విన్రమత లతో, కుమిలిపోతూ తన స్వామికి ఫిర్యాదుచేస్తూ ఉంటాడు. అందుచేతనే దేవుని అంతిమ ప్రవక్త (సఅసం), దుఆను "ఆరాధనాసారం" అనీ, దుఆ ప్రత్యేకమయిన ఆరాధన అని సెలవిచ్చారు.

"అన్ అనసిబ్ని మాలికిన్ అనిన్న బియ్యి సల్లల్లాహు
అలైహి వ సల్లం, ఖాల అద్దుఆవు ముఖ్ఖుల్ ఇబాదః"

అనువాదం:- కారుణ్యమూర్తి ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ప్రవచించగా అనస్ బిన్ మాలిక్ ఉల్లేఖించారు: 'దుఆ' ఆరాధన (ఇబాదత్) యొక్క సారం వంటిది'

వివరణ:- దైవ ప్రవక్త (సఅసం) 'దుఆ'ను 'ఆరాధనా సారం' అని ఎందుకు అభివర్ణించాలంటే దుఆ చేసే వ్యక్తి తన ఆశలన్నీ కేవలం అల్లాహ్‌పైనే పెట్టుకుంటాడు. ఆ సమయంలో దాసుడు సాధ్యమయినంత వరకు తన ప్రభువు వైపుకు ఏకాగ్రతతో మళ్ళుతాడు.

ముహియుద్దీన్ అరబీ ఎంత చక్కగా వ్యాఖ్యానించారో చూడండి:
"మనిషి శరీర అవయవాలు ఏ విధంగానయితే ఎముకలలోని రసం ద్వారా బలం పొందుతాయో అదే విధంగా ఆరాధకుల ఆరాధనలకు 'దుఆ' అనే రసం ద్వారా 'భయభక్తులు' ప్రాప్తమవుతాయి.

# ధర్మంలో దుఆ ప్రాధాన్యత

సృష్టికర్త తన గ్రంథం-ఖుర్‌ఆన్‌లో ఏ విధంగానయితే మానవాళిపై ఆదేశాలను జారీచేశాడో అదే విధంగా, ప్రార్థన కూడా విధిగా చేయాలని ఆయన సెలవిచ్చాడు. కేవలం తననే అడగాలని, సహాయం కోసం తనను మాత్రమే అర్థించాలని తన దాసుల్ని కోరాడు. సర్వం తన దగ్గరే ఉంది. ఆయన అనుమతి లేకుండా ఒక్క ఆకు కూడా దాని జాగాలోనుండి కదలదు. దివ్య గ్రంథంలో ఇలా ఆజ్ఞాపించబడింది.

"వఖాల రబ్బుకుముద్ ఊనీ అస్తజిబ్లకుమ్
ఇన్నల్లజీన యస్తక్బిరూన అన్ ఇబాదతీ
సయద్ ఖులూన జహన్నమ దాఖిరీన్" (మోమిన్-60)

అనువాదం:- మరియు మీ ప్రభువు అంటున్నాడు, "నన్నే పిలవండి-నేను మీ పిలుపును ఆలకించి అంగీకరిస్తాను. ఎవరైతే నా ఆరాధన (దాస్యం)పట్ల తలబిరుసుతనం వహిస్తారో, వారు నిస్సందేహంగా త్వరలో పరాభవం పాలై నరకంలోకి ప్రవేశిస్తారు."

ఈ ఆయత్‌ను పోలుస్తూనే మహా ప్రవక్త (స అసం) ప్రార్థనను 'ప్రత్యేకమయిన ఆరాధన'గా ఖరారు చేశారు.

2) "అనిన్నూమానిబ్ని బషీరిన్ అనిన్నబియ్యి సల్లల్లాహు అలైహి వసల్లం ఖాల అద్దుఆవు హువల్ ఇబా

దతు సుమ్మ ఖరఅ వఖాల రబ్బుకుముద్ ఊని అస్తజిబ్ల
కుమ్ ఇన్నల్లజీన యస్తక్బిరూన అన్ ఇబాదతీ
సయద్ ఖులూన జహన్నమ దాఖిరీన్
(తిర్మిజి, అబ్వాబు తఫ్సీరిల్ ఖుర్ఆన్)

అనువాదం:- నూమాన్ బిన్ బషీర్ ఉల్లేఖనం:

దైవ ప్రవక్త (స అసం) ఉపదేశించారు-దుఆ (ప్రార్థన) ప్రత్యేక మయిన ఆరాధన.' తరువాత ఆయన (స అసం) ఈ ఆయత్ పఠించారు: 'మీ ప్రభువు సెలవిస్తున్నాడు-నన్నే పిలవండి. నేనే మీ ప్రార్థనలను ఆమో దిస్తాను. నా దాస్యం పట్ల తలబిరుసుతనం వహించేవారు నిస్సంశయంగా త్వరలో పరాభవం పాలయి నరకంలోకి ప్రవేశిస్తారు.

౩. అల్ ఆరాఫ్ సూరాలో మరింత విపులంగా ఉంది-

"ఉద్వూ రబ్బకుమ్ తజర్రు అఁవ్వ ఖుఫ్యతన్ ఇన్నహు లా యుహిబ్బుల్ మూఁతదీన్. వలా తుఫ్సిదూ ఫిల్ అర్జి బాద ఇస్లాహిహా వద్ఊహు ఖవ్ఫఁవ్వ తమ అన్ ఇన్న రహ్మ తల్లాహి ఖరీబుమ్ మినల్ ముహ్సినీన్" (అల్ ఆరాఫ్-55,56)

అనువాదం:- మీ ప్రభువును వేడుకొనండి-వినమ్రులై మరియు లోలోన. నిస్సందేహంగా ఆయన మితిమీరి వ్యవహరించేవారిని ఇష్టపడడు. సంస్కరణ జరిగిన మీదట, భూమిపై కల్లోలాన్ని వ్యాపింప జేయకండి. ఇంకా, భయంతోనూ, ఆశతోనూ అల్లాహ్‌నే వేడుకొనండి. నిశ్చయంగా అల్లాహ్ కారుణ్యం సద్వర్తనుల సమీపంలోనే ఉంది."

వివరణ :- 'దుఆ' గురించి ఈ ఆయత్‌లలో స్పష్టమయిన ఉపదేశాలు ఇవ్వబడ్డాయి :

(అ) 'మీ ప్రభువును వినమ్రతతో, లోలోపల ప్రార్థించండి' -ఈ ఉపదేశంలో 'దుఆ' యొక్క వాస్తవికత, దాని రీతిని గురించి కూడా బోధించటం జరిగింది.

(ఆ) 'ఆయన్ని పిలవండి - భయంతోనూ, ఆశతోనూ!'

భయపడవలసింది అల్లాహ్ ఆగ్రహానికి, ఆశపడాల్సింది దైవ కారుణ్యం కోసం అన్నమాట! ఇంకా దేనికి భయపడాలంటే, ప్రార్థనలో ఏదయినా లోపం వల్ల గాని, మానవ సహజమయిన ఏదయినా దౌర్బల్యం వల్లగాని లోటు ఏర్పడితే ప్రార్థన త్రోసిపుచ్చబడుతుందేమోనన్న భయం చేత అన్నమాట!!

(ఇ) ఇతర ఆరాధనలు, ఆచరణల్లో మాదిరిగా 'దుఆ'లో కూడా హద్దు దాటి ప్రవర్తించకూడదు. హద్దుదాటి వ్యవహరించేవారంటే అల్లాహ్ ఇష్టపడడు.

(ఈ) సంస్కరణ (దిద్దుబాటు) జరిగిన తరువాత ధరణిపై కల్లోలం పుట్టించకండి. నిజ ప్రభువును కాదని ఇతరుల్ని తమ ప్రభువుగా నిలబెట్టుకోవటం అన్నిటికన్నా పెద్ద కల్లోలం.

(ఉ) భయంతో, ఆశతో కేవలం అల్లాహ్‌ను పిలిచేవారు, అర్థించేవారు ఉపకారులు. దైవ కారుణ్యం ఇలాంటి సద్వర్తనులకు దాపు (దగ్గర)లోనే ఉంటుంది. దీన్నిబట్టి తెలిసేదేమంటే నిజమయిన 'దుఆ' దాసుణ్ణి ఉపకారపు స్థాయికి తీసుకువెళ్తుంది. ఆరాఫ్ సూరాలోనే వేరొక చోట ప్రస్తావించబడింది—

4. "వలిల్లాహిల్ అస్మా ఉల్ హుస్నా
ఫద్ ఊహు బిహా"

(ఆరాఫ్- 180)

అనువాదం:- అల్లాహ్‌కు చక్కని పేర్లు ఉన్నాయి. మీరు ఆయన్ని ఆ (చక్కని) పేర్లతోనే పిలవండి.

5. "అస్ అలుక బికుల్లి ఇస్మిన్ హువలక సమ్మైత బిహీ
నఫ్సక అవ్ అన్‌జల్తహు ఫీ కితాబిక అవ్ అల్లమ్ అహ
దమ్ మిన్ ఖల్కిక అవిస్ తసర్త బిహీ ఫీ ఇల్మిల్ గైబి ఇన్దక"

అనువాదం:- నేను నిన్ను అడుగుతున్నాను- నీకున్న ఆ ప్రతి పేరుతో- ఏ పేరునైతే నువ్వు నీ కోసం పెట్టుకున్నావో!

(లేక ఆ పేర్లు) -వేటినయితే నువ్వు నీ గ్రంథంలో అవతరింప జేశావో!!

(లేక) నీ సృష్టితాలలో ఎవరికయితే వాటికి సంబంధించిన అగోచర జ్ఞానం ప్రసాదించావో!!!

(లేక) వాటిని నువ్వే నీ అగోచర జ్ఞానంతో నీ దగ్గరే భద్రంగా ఉంచుకున్నావో!!!!

(ఆ పేర్లతోనే నిన్ను అర్థిస్తున్నాను).

బఖరా సూరాలో పేర్కొనబడింది.

6. "వ ఇజా సాలక ఇబాదీ అన్నీ ఖరీబున్ ఉజీబు దావ

తద్దాయి ఇఖా దఆని ఫల్ యస్తజీబు లీ వల్‌యుమినూబీ
ం అల్లహుమ్ యర్షుదూన్"

(అల్ బఖర-186)

అనువాదం:-నా దాసులు నా గురించి నిన్ను అడిగితే, నేను వారికి అత్యంత సమీపంలోనే ఉన్నానని, పిలిచేవాడు నన్ను పిలిచినపుడు నేను అతని పిలుపును వింటాను మరియు సమాధానం పలుకుతాను అని ఓ ప్రవక్తా! నీవు వారికి తెలుపు. కనుక వారు నా సందేశం విని, దాన్ని స్వీకరించాలి, నాపట్ల విశ్వాసం కలిగి ఉండాలి, (ఈ విషయం నీవు వారికి వినిపించు), వారు రుజు మార్గం పొందే అవకాశం ఉంది.

వివరణ:- దాసులు తనను బిగ్గరగా అరచి పిలువవలసి నంతటి దూరంలో తాను లేనని ఈ ఆయత్‌లో విశ్వప్రభువు అంటున్నాడు. తనను బిగ్గరగా పిలువనవసరంలేదనీ, తన దర్బారులో ఇంకొక మధ్య వర్తిని పంపించి అతని చేత అడిగించవలసిన అవసరం కూడా లేదని అల్లాహ్ కరాకండిగా చెబుతున్నాడు.

తమ కోర్కెల్ని అల్లాహ్ స్వీకరించాలని కోరుకునేవారు, చిత్త శుద్ధితో ఆయనకు విధేయతను కనబరచటం కూడా అవసరమే మరి! కష్ట కాలంలో మొరపెట్టుకునేదేమో నిజ ప్రభువుకీ, మొక్కు బడులు చెల్లించేదేమో చిల్లర దేవుళ్ళకి అంటే ఎలా కుదురుతుంది!!

# 'దుఆ' చేయమని ప్రవక్తకు ఆజ్ఞ

తమ ప్రభువును పిలవమనీ, వేడుకొమ్మని దాసులందరికీ ఆజ్ఞ అయింది.

అయితే, ఖుర్ఆన్‌లో అల్లాహ్, తనకు అత్యంత చేరువలో ఉన్న, తనకు ఇష్టమయిన, ఉన్నత శిఖరాలను అధిరోహించిన తన దాసుణ్ణి (ముహమ్మద్‌ను) కూడా ఆజ్ఞాపించాడు—తనను ప్రార్థించమని !

'దుఆ' చేయమని ముహమ్మద్ (సఅసం)ను కూడా ఆజ్ఞాపించటం జరిగిందంటే, మహాప్రవక్త (సఅసం)ఆ ఆజ్ఞను తు.చ. తప్పకుండా శిరసావహించారంటే దీన్ (ధర్మం)లో 'దుఆ' ప్రాధాన్యత ఎంతటిదో తెలిసి వస్తోంది. మానవ చరిత్ర మొత్తంలోనే ఇలాంటి దృష్టాంతం కనిపించదంటే అతిశయోక్తి కాదేమో !

## జ్ఞానాభ్యుదయం కోసం...

1. "వఖుల్ రబ్బి జిద్‌ని ఇల్మన్"

(తాహా - 14)

అనువాదం :- "మరియు ప్రార్థించండి - ఓ నా ప్రభూ ! నాకు మరింత జ్ఞానం వొసగు"

వ్యాఖ్యానం :- దైవ సందేశ అవతరణ ప్రారంభకాలంలో, దైవ దూత జిబ్రయీల్ (అలైహిస్సలాం)తో పాటు మహా ప్రవక్త (సఅసం) కూడా ఒక్కొక్క ఆయత్‌ను, ఒక్కొక్క పదాన్ని పఠించేవారు. ఏదైనా పదం గుర్తుకు రాకుండాపోతుందేమోనన్న భయంతో అలా జాగ్రత్తపడే వారు దైవ ప్రవక్త. ఆ విషయమయి అల్లాహ్ గ్యారంటీ తీసుకున్నాడు. అయితే తాహా సూరాలో మాత్రం, మరింత ఎక్కువ జ్ఞానం (జ్ఞాపకం)కోసం తనను ప్రార్థించమని అల్లాహ్ తన ప్రవక్తను ఆజ్ఞాపించాడు.

దీని ద్వారా తెలిసేదేమంటే, దాసులు తనను అడగటం అంటే విశ్వప్రభువు ఎంతో సంతోషిస్తాడు. అందులోనూ, ధార్మిక జ్ఞాన వికాసం దుఆ చేసే దాసులంటే ఇంకెంతో సంతోషిస్తాడు. ఇస్లాంలో 'దుఆ'మరియు 'జ్ఞానం' యొక్క ప్రాధాన్యత ఎంత గొప్పదో ఈ చిన్న ఆయత్ ద్వారా అంచనా వేయవచ్చు.

## అధికారం, ఆధిక్యతలకై ప్రార్థన

2) "వఖుల్ రబ్బి అద్‌ఖిల్నీ ముద్‌ఖల సిద్‌ఖివ్వ అఖ్‌రిజ్‌నీ ముఖ్ రజ సిద్‌ఖివ్వజ అల్లీ మిల్లదున్క సుల్తానన్నసీరా."

(బనీ ఇస్రాయీల్-80)

అనువాదం:- మరియు ప్రార్థించండి: "ప్రభూ! నువ్వు నన్ను ఎక్కడికి తీసుకు వెళ్ళినా సత్యంతో తీసుకు వెళ్ళు. ఎక్కడ నుండి తీసినా సత్యంతో తియ్యి. ఇంకా నీ తరఫు నుండి ఒక అధికారాన్ని నా సహాయకారిగా చెయ్యి.

వ్యాఖ్యానం:- మక్కా నుండి మదీనాకు వలస (హిజ్రత్) పోవల సిన పరిస్థితి ఆసన్నమయినపుడు, అధికారం కోసం తనను వేడుకొమ్మని అల్లాహ్ ప్రవక్త (సఅసం)ను ఆజ్ఞాపించాడు. ఆ అధికారం దేనికోసం?

రానున్న కాలంలో అసత్యవాదులను, తిరస్కారులను ఎదుర్కొనడానికి కావలసిన బలం మరియు అధికారం కోసం? సత్య ధర్మాన్ని తుడిచి పెట్టాలని తలపెట్టిన దుర్మార్గులను ఎదుర్కొనడానికి కావలసిన బలం కోసం!!

ఇక్కడ మరో విషయం కూడా గమనార్హమే.

అ) మంచిని స్థాపించటానికి, చెడును సమూలంగా నిర్మూలించడానికి కూడా అధికారం అవసరమే.

ఆ) అధికారం మరియు దైవ సహాయం లేకుండా మిథ్యావాదాన్ని దుర్మార్గాన్ని అణచివేయటం సాధ్యంకాని పని. అధికారం లేకుండా ఖుర్ఆన్ ఆజ్ఞల్ని, నియమాలను, షరీఅత్‌ను సంపూర్ణంగా నెలకొల్పటం కూడా కష్టసాధ్యమే. అందుకనే అధికారం కోసం తనను ప్రార్థించమని అల్లాహ్ ఆయనను (సఅసం)ను ఆజ్ఞాపించాడన్నమాట!

## ప్రభుత్వం కోసం...

> 3. ఖులిల్లాహుమ్మ మాలికల్ ముల్కి తుతిల్ ముల్క మన్తషావు వ తన్‌జివుల్ ముల్క మిమ్మన్‌తషావు వతుయిజ్జు మన్తషావు వతుజిల్లు మన్తషావు బియదికల్ ఖైర్. ఇన్నక అలాకుల్లి షయ్యిన్ ఖదీర్"

అనువాదం:- ప్రార్థించండి, "ఓ అల్లాహ్! సార్వభౌమాధికారానికి ప్రభూ!! నీవు కోరిన వారికి ప్రభుత్వాధికారాన్ని ప్రసాదిస్తావు; నీవు కోరిన

వారి నుండి దాన్ని లాక్కుంటావు. నీవు కోరిన వారికి గౌరవం ప్రసాదిస్తావు; నీవు కోరిన వారిని పరాభవంపాలు చేస్తావు. శుభాలు నీ హస్తగతమై ఉన్నాయి. నిస్సందేహంగా నీవు అన్నింటిపై అధికారివి"

వ్యాఖ్యానం:- రోము, పారసీక రాజ్యాలు తన అనుయాయులకు ప్రాప్తం కావాలని కోరుతూ మహాప్రవక్త (స అసం) ప్రార్థించగా అవతరించిన అయత్ ఇది.

మహాప్రవక్త ముహమ్మద్ (స అసం)కు ఈ ప్రార్థన చేయమన్న ఆజ్ఞ అయినపుడు. అరబ్బు రాజ్యమే కాదు, రోము పారసీక రాజ్యాలు కూడా ముస్లిములకు ప్రాప్తం కానున్నాయన్న వాస్తవాన్ని ఇస్లాం శత్రువులు కలలోనయినా ఊహించలేక పోయారు. మదీనా ప్రదేశం ఆనాడు బద్దవిరోధులయిన పరిసరాల (దేశాల) మధ్య ఉండటాన్ని చూచి యూదులు, కపటులు పరిహసించేవారు. రోము, పారసీక రాజ్యాలు ఒకనాడు చిట్టిపొట్టి రాజ్యమయిన మదీనా ఒడిలోకి రానున్నాయని వారు ఏ మాత్రం ఊహించలేక పోయారు.

## మార్గ దర్శకత్వంపై స్థిరత్వం కోసం ప్రార్థన :

4. "ఖులిల్లాహుమ్మ ఫాతిరస్సమావాతి వల్ అర్జి
ఆలిమల్‌గైబి వష్షహాదతి అన్తతహ్కుము
బైన ఇబాదిక ఫీ మాకాను ఫీహి యఖ్తలిఫూన్"

(అజ్జుమర్-46)

అనువాదం:- వేడుకొనండి, ఓ ప్రభూ! భూమ్యాకాశాల సృష్టికర్తా!! గోప్యంగా ఉన్నదాన్నీ, బహిర్గతంగా ఉన్న దాన్ని గురించి తెలిసినవాడా!!! నీవే నీ దాసుల మధ్య ఆ విషయంలో నిర్ణయం చేస్తావు- దేనిగురించయితే వారు (పరస్పరం) విభేదించేవారో."

వివరణ:- మహనీయ ముహమ్మద్ (సఅసం) తహజ్జుద్ నమాజ్ ప్రారంభంలో అజ్జుమర్ సూరాలోని ఈ ఆయత్‌ను పఠించేవారని హజ్రత్ ఆయిషా సిద్దికా (ర అ) ఉల్లేఖించారు.

ఆ తరువాత ప్రవక్త (సఅసం) ఈ విధంగా ప్రార్థించేవారు:
5. ఇహ్దిని లిమఖ్తులిఫా ఫీహి మినల్ హఖ్ఖి బి ఇజ్నిక
ఇన్నక తహ్దీ మన్తషాపు ఇలా సిరాతిమ్ ముస్తఖీమ్"
(ముస్లిం, ఇబ్నె కసీర్ ఆధారంగా-IV)

అనువాదం:- "సత్యం గురించి సృష్టించబడిన అభిప్రాయభేదం విషయంలో నన్ను రుజుమార్గంపై నిలకడగా ఉంచు! నిస్సందేహంగా నువ్వే కోరిన వారిని రుజుమార్గం వైపుకు దారి చూపుతావు."

## చెడుల నుండి రక్షణ కోసం...

మానవుడ్ని అన్ని రకాల చెడుల వైపుకు తీసుకుపోవాలని ఎత్తులు వేసేవాడు, ప్రేరేపించేవాడు షైతాన్. ఈ దుష్టుని బారి నుండి రక్షణ పొందే నిమిత్తం 'దుఆ' చేయమని కూడా ముహమ్మద్ (సఅసం) గార్కి ఆజ్ఞ ఇవ్వబడింది.

6. "ఖుజిల్ అఫ్వ వాముర్ బిల్ ఉర్ఫి వ ఆరిజ్ అనిల్ జాహిలీన్. వ యిమ్మా యన్జ ఘన్నక మినష్షయితాని నజ్ గున్ ఫ స్తయిజ్ బిల్లాహి ఇన్నహు సమీవున్ అలీమ్."
(అల్ ఆరాఫ్-199, 200)

అనువాదం:- ఓ ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించండి; మంచిని ప్రబోధించండి; మూర్ఖులను పట్టించుకోకండి. ఒక వేళ షైతాన్ ఎప్పుడయినా మిమ్మల్ని ప్రేరేపిస్తే అల్లాహ్ శరణు కోరండి. ఆయన అన్నీ వినేవాడు, అన్నీ తెలిసినవాడు.

వ్యాఖ్యానం:- సత్య ప్రకటన, మంచిని ప్రబోధించటం, చెడులకు దూరంగా ఉండమని తాకీదు చేయటం- ఇవి అంత సులభమయిన పనులు కావు. ఇది పూలబాట అంతకన్నా కాదు. ఈ మార్గంలో సత్య సందేశకుడు ఎన్నో కష్ట నష్టాలను, ఒడిదుడుకులను ఎదుర్కోవలసి వస్తుంది. మూర్ఖులు అజ్ఞానుల పరిహాసాలను భరించవలసి రావచ్చు. అయితే, సత్యంతో పాటు సహనంతో, ఓరిమితో కూడా మెలగమని దివ్య ఖుర్ఆన్ ఉపదేశిస్తోంది.

షైతాన్ జిత్తుల నుండి, వాడు సృష్టించే అడ్డంకులనుంచి తప్పించుకోవటానికి ఏకైక మార్గం అల్లాహ్ శరణు కోరటమే కనుక, షైతాన్ బారి నుండి రక్షణ పొందేనిమిత్తం తనను వేడుకొమ్మని అల్లాహ్ తన ప్రవక్తకు ఆజ్ఞాపించాడు.

7. "ఇద్ ఫ అ బిల్లతి హియ అహ్సనుస్సయ్యి అతనహ్ను ఆలము బిమా యసిఫూన్ వఖుల్ రబ్బి అవూజుబిక మిన్

హమజాతిష్షయాతీన్. వ అవూజుబిక రబ్బి అంయ్యహ్
జురూన్."

(మోమినూన్: 96-97)

అనువాదం:- ఓ ప్రవక్తా! చెడును ఉత్తమ రీతిలో నిర్మూలించండి, మీపై వారు ఏమేం మాటలు కల్పిస్తున్నారో మాకు బాగా తెలుసు, ఇంకా (ఇలా) ప్రార్థించండి, 'ప్రభూ! నేను షైతాన్ ప్రేరణ నుండి నీ శరణు వేడుతున్నాను. అంతేకాక ప్రభూ!-వాడు నా సమీపానికి రావటం నుండి సయితం నీ శరణు కోరుతున్నాను'.

## క్షమాభిక్ష కోసం

సగటు మనిషి యొక్క మామూలు దౌర్బల్యాలు ఊపేక్షించబడతాయి (చూచీ చూడనట్లుగా వదలి వేయబడతాయి) గాని, ఒక అత్యున్నత స్థాయికి చేరిన, ఉన్నత శిఖరాలను అధిరోహించిన వ్యక్తి యొక్క మామూలు తప్పులు ఎట్టి పరిస్థితుల్లోనూ ఉపేక్షించబడవు. అతని చిన్న చిన్న లోపాలే ఒక్కొక్కప్పుడు అతన్ని పెద్ద ఇరకాటంలో పడేస్తాయి

క్షమాభిక్ష కోసం ప్రార్థించమని దైవ ప్రవక్తలకు ఆజ్ఞాపించబడిందంటే, అది వారి ఉన్నత స్థాయికి తగిన రీతిలోనే ఆజ్ఞాపించబడిందన్న సైద్ధాంతిక విషయాన్ని మనం ఎల్లప్పుడూ దృష్టిలో ఉంచుకోవాలి.

క్షమాభిక్ష కోసం మొర పెట్టుకోవటం వల్ల కేవలం దౌర్బల్యాలు మాత్రమే క్షమించబడవు, పైగా దానివల్ల దాసుని భయభక్తుల స్థాయి కూడా పెరుగుతుందన్న నిజాన్ని తెలుసుకోవాలి.

దైవ సందేశహరులకు కూడా క్షమాభిక్షకై వేడుకొమ్మని ఆజ్ఞాపించటం జరిగింది:—

8. "వఖుల్ రబ్బిఘ్ ఫిర్ వర్‌హమ్ వఅన్త ఖైరుర్రాహిమీన్"
(మోమినూన్-118)

అనువాదం:- మరియు అనండి,-'ఓ నా ప్రభూ! (నా తప్పుల్ని) మన్నించు. (నన్ను) కరుణించు. నీవు కరుణించే వారందరిలో కెల్లా ఎక్కువగా కరుణించేవాడవు.'

9. "ఫస్బిర్ ఇన్న వ అదల్లాహి హఖ్ఖున్ వస్తగ్ఫిర్ లి జమ్బిక వసబ్బహ్ బిహమ్ది రబ్బిక బిల్ అషియ్యి వల్ ఇబ్కార్"
(మోమిన్-55)

అనువాదం:- కనుక ఓ ప్రవక్తా! ఓర్పు వహించండి. నిస్సంశయంగా అల్లాహ్ వాగ్దానం సత్యమైంది. మరియు మీ పాపాల క్షమాణకై ప్రార్థించండి. ఉదయం, సాయంత్రం మీ ప్రభువు యొక్క స్తోత్రంతో ఆయన్ని స్మరిస్తూ ఉండండి.

(10) "ఫాలమ్ అన్నహు లా ఇలాహ ఇల్లల్లాహు వస్తగ్ఫిర్ లిజన్బిక వలిల్ మోమినీన వల్‌మోమినాతి వల్లాహు యాలము ముతఖల్లిబుకుమ్ వ మస్వాకుమ్" (ముహమ్మద్-19)

అనువాదం:- కనుక ఓ ప్రవక్తా! అల్లాహ్ తప్ప దాస్యానికి ఎవడూ అర్హుడు కాడని బాగా తెలుసుకోండి, మీ అపరాధాల మన్నింపు కోసం

ప్రార్థించండి, విశ్వాసులయిన పురుషులు మరియు స్త్రీల మన్నింపు కోసం కూడా ప్రార్థించండి మీరు (అల్లాహ్ వైపుకు) మరలి రావటం గురించి, ఇంకా, మీ నివాసం గురించి అల్లాహ్ బాగా ఎరిగి ఉన్నాడు.

వివరణ:- "ఇస్తిగ్ఫార్" చేయమన్న దైవాజ్ఞను మహాప్రవక్త (స అసం) వీలయినంత అధికంగా పాటించారు. నమాజ్‌లలో 'దుఆ' చేయటంతో పాటు ఆయన రోజుకు 70 సార్లు ఇస్తిగ్ఫార్ చేసే వారని హదీసులద్వారా తెలుస్తోంది. రోజుకు 100 సార్లు కూడా "ఇస్తిగ్ఫార్" చేసేవారని మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా రూఢీ అవుతోంది.

11. "ఫసబ్బిహ్ బిహమ్ది రబ్బిక వస్తగ్ఫిర్‌హు ఇన్నహు కాన తవ్వాబా"

(నస్ర్-4)

అనువాదం:- "....అయితే మీ ప్రభువును స్తోత్రంతో పాటు జ్ఞాపకం చెయ్యండి. పాపాల క్షమాపణ కోసం ఆయన్ని ప్రార్థించండి. నిస్సందేహంగా ఆయన పశ్చాత్తాపాన్ని ఎక్కువగా స్వీకరించేవాడు."

వివరణ:- మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు మరణ కాలం సమీపించినపుడు "ఇజాజ (IJAZA) అ నస్రుల్లాహి వల్ఫత్‌హు" అనే ఈ సూరా అవతరించింది. ఇందులో కూడా దైవస్తోత్రం, దైవస్మరణ చెయ్యమని, అపరాధాల మన్నింపుకోసం అర్థించమని ప్రవక్త (సఅసం)కు ఆజ్ఞ ఇవ్వబడింది. మరణ కాలం దగ్గర పడుతోందన్న సంకేతం కూడా ఈ సూరా ద్వారా ప్రవక్తకు ఇవ్వబడిందని సహీహ్ హదీసులలో పేర్కొనబడింది.

# దైవ దూతలకు 'దుఆ' ఆజ్ఞ

దైవ దూతలు ప్రతి పనినీ విశ్వ ప్రభువు ఆజ్ఞకు లోబడి నిర్వహిస్తారని దివ్య ఖుర్‌ఆన్ చెబుతోంది.

"యఫ్ అలూన మా యూమరూన"

(దేన్ని గురించి అయితే ఆజ్ఞ అవుతుందో ఆ పనే దైవ దూతలు చేస్తారు).

ముస్లిం పురుషులు మరియు స్త్రీల కోసం వారు చేసే దుఆ కూడా దైవాజ్ఞకు లోబడిందేనన్న విషయం ఇక్కడ గమనార్హం. విధేయులయిన తన దాసుల కోసం ప్రార్థించమని దేవుడు తన దూతలను ఆజ్ఞాపించాడు.

దైవ దూతల పెద్ద దుఆ (ప్రార్థన) ఒకటి మోమిన్ సూరాలోని ప్రారంభపు ఆయత్‌లలో ఉంది; దాని అనువాదం ఇక్కడ ఇస్తున్నాము:

"అల్లాహ్ సింహాసనాన్ని మోసే దూతలు, సింహాసనం చుట్టూ పరిభ్రమించే దూతలు-వారంతా తమ ప్రభువును స్తోత్రంతో సహా స్మరిస్తూ ఉంటారు. వారు ఆయన్ని విశ్వసించిన వారు. ఇంకా, విశ్వసించిన వారి అపరాధాల క్షమాపణ కోసం వారు ప్రార్థిస్తారు. వారు అంటారు : ఓ మా ప్రభూ! శాశ్వతంగా ఉండే స్వర్గాల్లో వారిని చేర్చు-దేన్ని గురించి అయితే నీవు వాగ్దానం చేశావో-వారి తల్లి దండ్రులను, భార్యలను, వారి సంతానం లోని సజ్జనులను (వీరికి

కూడా వారితో పాటు స్వర్గంలో స్థానం కల్పించు) చెడుల నుండి వారిని రక్షించు, ప్రళయ దినాన నీవు ఎవరినయితే చెడుల నుండి కాపాడుతావో వారిపై నీవు ఎక్కువగా దయ చూపావు. ఇదే పెద్ద సాఫల్యం.

(మోమిన్ : 7-9)

దూతలు, అల్లాహ్‌కు ఇష్టమయిన దాసుల కోసం ప్రార్థిస్తారని హదీసులలో కూడా ఉంది.

# దైవేతరులను అడగటం "షిర్క్" తో సమానం

దుఆ (ప్రార్థన) అనేది దేవుని ఏకత్వానికి నిదర్శనం. ఎవరయినా తన నిజ ప్రభువు ఎదుట వచ్చి ప్రార్థించాడంటే 'దేవుని ఏకత్వం' వైపుకు అతడు పూర్తిగా మళ్ళాడన్నమాట! అందుచేతనే ఖుర్ఆన్, దైవేతరులను అడగటాన్ని 'షిర్క్' (బహుదైవోపాసన) గా వర్ణించింది. షిర్క్ పట్ల అల్లాహ్ తన దాసులను గట్టిగా వారించాడు. దానికి సంబంధించిన కొన్ని ఖురానీ ఆయత్‌లను ఇక్కడ పొందుపరుస్తున్నాము:

1. ఆయన రాత్రిని పగలు లోనికి, పగలును రాత్రిలోనికి ప్రవేశింప జేస్తాడు. ఆయన సూర్యుణ్ణి, చంద్రుణ్ణి తన స్వాధీనంలో ఉంచుకున్నాడు. వాటిలో ప్రతి ఒక్కటీ తన నిర్ణీత కాలపరిమితిలో సంచరిస్తున్నది. ఆయనే అల్లాహ్-మీ ప్రభువు, ప్రభుత్వం ఆయనదే. అల్లాహ్‌ను వదలి మీరు ఎవరెవరినయితే పిలుస్తున్నారో వారు పరకంత వస్తువుపై కూడా యజమానులైలేరు. ఒకవేళ మీరు మొర పెట్టుకుంటే వారు మీ మొరలను ఆలకించ(లే)రు. ఒక వేళ ఆలకించినా మీకు సమాధానం ఇవ్వలేరు. ఇంకా, ప్రళయదినాన వారు, మీరు చేసిన "షిర్క్ దుఆ" లను త్రోసి పుచ్చుతారు. తెలిసిన వారు (అల్లాహ్) లాగా, మీకు ఈ యదార్థం యొక్క నిజమయిన సమాచారాన్ని ఎవరూ ఇవ్వలేరు.

(అల్ ఫాతిర్ - 13,14)

వివరణ:- ఈ ఆయత్ లలో, దైవేతరలను వేడుకొనటాన్ని, అక్షరాలా షిర్క్ (బహు దైవోపాసన) గా పేర్కొనడం జరిగింది. నిస్సందేహం గా "షిర్క్" లో దైవేతరుల దాస్యం, మొక్కుబడులు మొదలగునవి చేరి ఉన్నాయి.

"వలాతద్ఊ మిన్ దూనిల్లాహి మాల యన్ఫఉక వలా యజుర్రుక, ఫయిన్ఫఅల్త ఫ ఇన్నక ఇజమ్ మినజ్జాలిమీన్"

(యూనుస్-106)

అనువాదం:- అల్లాహ్‌ను వదలి నీకు లాభాన్నిగాని, నష్టాన్నిగాని, కలిగించలేని ఏశక్తినీ పిలవకు. ఒకవేళ నీవు అలాచేస్తే దుర్మార్గుల్లోని వాడవవుతావు.

ఏ వ్యక్తయినా దైవేతరులవైపు మళ్ళాడంటే దైవేతరుడ్ని పిలిచాడంటే దాని అర్థం; అతడు అతన్ని తన ఆరాధ్య దైవంగా చేసుకున్నట్లేనని కూడా దివ్యఖుర్ఆన్ స్పష్టపరచింది. దైవేతరుడ్ని కొలవటంలోనూ, అతన్ని అడగటంలోనూ తేడా ఏమీలేదు-రెండింటి పరమార్థం ఒక్కటే!

ఫలా తద్ఊ మ అల్లాహి ఇలాహన్ ఆఖర ఫతకూన మినల్ ము అజ్జబీన్"

(షూరా-213)

అనువాదం:-"(ఓ ప్రవక్తా)అల్లాహ్‌కుసహవర్తినిగావేరొక దైవాన్ని పిలవకండి. అలాచేస్తే మీరు శిక్ష అనుభవించే వారిలో చేరిపోతారు."

దీనిద్వారా తెలిసేదేమంటే, అల్లాహ్‌కు తోడు వేరొకరిని అడగటం, పిలవటం అనేది అల్లాహ్‌తో పాటు వేరొకరికి ఆ సమానస్థాయిని కల్పించటమన్నమాట! దేవుని చట్టం (అన్నింటికీ) అతీతమయింది, తిరుగులేనిది. ఈ షిర్క్ (భాగస్వామ్యం) లో ఎవరు దఖలు యిచ్చినా వారు దైవాగ్రహం' శిక్ష నుండి తప్పించుకోలేరు.

హదీసుల వెలుగులో

# "దుఆ" ప్రాధాన్యత - దాని మహత్తు

'దుఆ' గురించి మహాప్రవక్త (సఅసం) చేసిన ప్రవచనాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. దుఆ ప్రాధాన్యతను, దాని మహత్తును తెలిపే కొన్ని ప్రవచనాలను ఇక్కడ పేర్కొంటున్నాము.

## 'దుఆ' గురించి తాకీదు :

దైవ ప్రవక్త (సఅసం) స్వయంగా, ఎంతో ఎక్కువగా ప్రార్థించే వారు. ఆ 'ప్రార్థన' లన్నింటినీ సంకలనం చేస్తే ఓ పెద్ద గ్రంథమే తయారవుతుంది.

(1) "ఫ అలైకుమ్ బిద్దుఆయి"
(మీరు 'దుఆ' చేయటం తప్పనిసరి)

2. "ఇబ్ను మస్ ఊదిన్ రఫ అహు సల్లుల్లాహ మిన్ ఫజ్లిహి ఫ యిన్నల్లాహ యుహిబ్బు అంయ్యుస్ అల వ అఫ్జలుల్ ఇబాదతి ఇన్తిజారుల్ ఫర్జి"

(జమ్ఉల్ ఫవాయిద్, బహవాలె తిర్మిజి)

అనువాదం : మహా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఉపదేశించారని ఇబ్నె మస్ఊద్ (రఅ) చెప్పారు: అల్లాహ్‌ను, ఆయన కారుణ్యం కొరకు అడగండి. ఎందుకంటే (తన దాసులు) అడగటాన్ని ఆయన ఇష్టపడతాడు. లేమికి గురయి ఉన్న సమయంలో అనుగ్రహం (కలిమి) కోసం నిరీక్షించటం ఉత్తమమయిన ఆరాధన.

3. "అబూహురైరత రఫ అహు మల్లమ్ యన్ అలిల్లాహ యగ్జిబ్ అలైహి"

అనువాదం : "తనను ప్రార్థించని (అడగని) వారిపై అల్లాహ్ ఆగ్రహం చెందుతాడు.

## అత్యధికంగా ప్రార్థించాలి :

మానవోత్తములు (సఅసం) తన సహచరులను అత్యధికంగా 'దుఆ' (ప్రార్థన) చేయమని బోధించారు.

ఒకసారి మహా ప్రవక్త (సఅసం) దుఆ యొక్క లాభాలను వివరించారు. అది విన్న కొందరు సహచరులు అన్నారు: "అయితే ఓ దైవ ప్రవక్తా! మేము అత్యధికంగా వేడుకుంటాము." ప్రవక్త (సఅసం) బదులిచ్చారు- 'దైవ కారుణ్యం మీ ప్రార్థనలకంటే ఎంతో ఎక్కువే.'

అంటే దేవుని ఖజానా, ఆయన కరుణానుగ్రహాలు అంతులేనివి. కనుక ఎలాంటి ప్రార్థనలకు ఆయన ఆమోదముద్ర వేసి కోర్కెలు తీర్చినప్పటికీ ఆయన ఖజానా (ధనాగారం)లో ఏ మాత్రం లోటు రాదు.

# 'దుఆ' మహత్తు

1 "అన్ అబీహురైరత (ర అ) అనిన్నబియ్యి సల్లాల్లాహు అలైహి వసల్లం లైస షయ్ఉన్ అక్రమ అలల్లాహి మినద్దుఆయి."

(తిర్మిజి)

అనువాదం : దైవ సన్నిధిలో దుఆ కంటే గౌరవప్రదమయిన వస్తువు ఏదీ లేదు.

వివరణ : అల్లాహ్‌కు ఏ విధంగానయితే తన దాసుల్లోని గర్విష్ఠులు, అహంకారులు, పొగరుబోతులు అంటే అయిష్టమో, అదే విధంగా సద్వర్తనులు అయిన దాసులు తన సన్నిధికి వచ్చి, తమ నిస్సహాయతను, దీనావస్థను, అసమర్థతను ప్రదర్శించటం అంటే ఆయనకు ఎంతో ఇష్టం.

విశ్వాసిని దైవానుగ్రహాలకు అర్హునిగా చేస్తుంది దుఆ. 'దుఆ' (ప్రార్థన) వల్ల మనిషిస్థాయి పెరుగుతుంది.

2 అబూహురైరత(ర.అ.)రఫఅహు ఇన్నల్లాహ తఆల ల యర్ఫ్వు లిర్రజులిద్దరజత ఫయఖూలు అన్నా లీ హజ? ఫయఖూలు బి దుఆయి వాలిదిక లక్"

("జమ" బహావాలయె బజార్)

అనువాదం:- మానవమహోపకారి (సఅసం) ఉపదేశించారని హజ్రత్ అబూహురైరా (ర. అ.) ఉల్లేఖించారు: 'అల్లాహ్ తన దాసునికి ఉన్నత స్థానం ప్రసాదించగా అతను అడుగుతాడు. నాకీ స్థానం ఎలా ప్రాప్తమయిందీ అని! దానికి బదులుగా అల్లాహ్ అంటాడు: నీ సంతానం చేసిన ప్రార్థనకు ప్రతిఫలంగా (నీకు ఈ ఉన్నత స్థానం యివ్వటం జరిగింది.

# నియమాలు, నిబంధనలు

ఇంత వరకు చర్చించిన దాన్ని బట్టి–సత్య ధర్మంలో–దుఆ (ప్రార్థ న)కు ఎంత ప్రాముఖ్యత ఉందో మీకు బోధపడే ఉంటుంది.

అయితే ఇంతటి ప్రాముఖ్యతను సంతరించుకున్న 'దుఆ' యొక్క నియమాలు, నిబంధనలను గురించి తెలుసుకోవటం కూడా అవసరమే మరి! ఖురాన్, హదీసుల అధ్యయనం ద్వారా తెలిసే దేమంటే, ఏ ఆరాధన కూడా నియమ నిబంధనలు లేకుండా లేదు. ప్రతిదానికీ కొన్ని నిబంధనలు, మరి కొన్ని రీతులు తప్పక ఉంటాయి. విచారకరమయిన విషయం ఏమంటే మనం ఆరాధనా ఫలాలనయితే మస్తుగా జుర్రుకోవాలని ఆశిస్తాంగాని ఆరాధనా రీతులు, నిబంధనల గురించి అంతగా పట్టించుకోము.

'దుఆ' నిబంధనలను మూడు రకాలుగా విభజించవచ్చు.

(అ) కొన్ని నింబధనలు 'దుఆ'కు ముందు ఉన్నాయి.

(ఆ) మరి కొన్ని నిబంధనలు 'దుఆ'లో ఇమిడి ఉన్నాయి.

(ఈ) ఇంకా కొన్ని నిబంధనలు 'దుఆ' చేసిన తరువాత ఉన్నాయి.

'దుఆ' చేసేముందు రెండు విషయాలను గమనించాలి.

## I ధర్మాన్ని అల్లాహ్ కోసం ప్రత్యేకం చేసుకోవటం

ఇది చాలా ముఖ్యమయినది. ఈ నిబంధనకు కట్టుబడనిదే ఏ ఆరాధన కూడా దైవసన్నిధిలో స్వీకార యోగ్యం కాదు. ధర్మాన్ని కేవలం

అల్లాహ్ కోసం ప్రత్యేకించుకోవటం అంటే ఆయన దాస్యంలో మరొక రెవరినీ భాగం కల్పించరాదన్నది దాని ప్రధాన ఉద్దేశ్యం. దాస్యం ఆయ నకే చేయాలి. విధేయత ఆయనకే చూపాలి. ఏది చేసినా విశ్వప్రభువు ప్రసన్నతను చూరగొనటమే దాసుని ధ్యేయం అయి ఉండాలి. అయితే ప్రదర్శనాబుద్ధికి స్థానం ఇవ్వరాదు. ఆరాధనా విధేయతలు 'షిర్క్' నుండి పరిశుద్ధంగా ఉండాలి.

ఎవరయినా ఈ షరతులను పాటించకుండానే తమ ప్రార్థనలను దేవుడు ఆలకించి ఆమోదిస్తాడని ఆశలు పెట్టుకుంటే అది వారి అపోహ మాత్రమే. ఆరాధన విషయంలో ఇలా బోధించబడింది,

1. "ఇన్నా అన్‌జల్నా ఇలైకల్ కితాబ బిల్‌హఖ్ఖి ఫాబుదిల్లాహ ముఖ్లిసన్ లహుద్దీన్, అలా లిల్లాహిద్దీనుల్ ఖాలిస్"

(అజ్జుమర్-2,3)

అనువాదం:- (ఓ ముహమ్మద్) ఈ గ్రంథాన్ని మేము మీ వైపుకు సత్యంతో అవతరింప చేశాము. కాబట్టి మీరు అల్లాహ్ దాస్యం మాత్రమే చేయండి-ధర్మాన్ని ఆయనకే ప్రత్యేకం చేస్తూ! జాగ్రత్త!! అది ఆయన హక్కు.

2. "వద్ ఊహు ముఖ్లిసీన లహుద్దీన్" (ఆరాఫ్-29)

అనువాదం:- "ఆయన్నే పిలవండి, మీ ధర్మాన్ని ఆయన కోసమే ప్రత్యేకం చేసుకుని."

3. మోమిన్ సూరాలో ఉంది:

"ఫద్ ఊహుల్లాహ ముఖ్లిసిన లహుద్దీన వలవ్ కరిహల్ కాఫిరూన్" (మోమిన్-14)

అనువాదం : కనుక అల్లాహ్‌నే పిలవండి- మీ ధర్మాన్ని ఆయన కోసమే ప్రత్యేకం చేసుకుని (పిలవండి)- ఒక వేళ మీ ఈ చర్య తిరస్కారులకు ఎంత సహించరానిదయినా సరే.

వివరణ : దీని ద్వారా బోధపడేదేమంటే, ధర్మాన్ని కేవలం అల్లాహ్ కోసమే ప్రత్యేకం చేసుకుని ఆయన్నే పిలవటం, తిరస్కారులకు సహించదు. అల్లాహ్‌తో పాటు ఇతరులను కూడా కలిపి పిలవటమంటే వారు ఇష్టపడతారు.

## || హలాల్ సొమ్ము (ధర్మసమ్మతమయినది) తినేవాడై ఉండాలి :

ప్రార్థన దైవసన్నిధిలో స్వీకారయోగ్యం కావటానికి పాటించాల్సిన రెండో నియమం - అతను తినే ఆహారం "హలాల్" (ధర్మ సమ్మతం) అయి ఉండాలి. అతని సంపాదన 'హలాల్' సంపాదన అయి ఉండాలి.

అంతిమ దైవ ప్రవక్త (సఅసం) ప్రకటించారు. 'ప్రజలారా! అల్లాహ్ అన్ని లోపాలు, దోషాలకు అతీతుడు, పరిశుద్ధుడు. కేవలం 'హలాల్' మరియు పరిశుద్ధమయిన వాటినే ఆయన స్వీకరిస్తాడు. ఈ విషయంలో ఆయన తన ప్రవక్తలకు ఇచ్చిన ఆజ్ఞనే తన విశ్వాసులకూ యిచ్చాడు.

అల్లాహ్ తన ప్రవక్తలతో అన్నాడు- 'నా సందేశ హరులారా! మీరు పరిశుద్ధమయిన, ధర్మసమ్మతమయిన ఆహారం భుజించండి, మంచిని బాగా 'ఆచరించండి.' మీరు ఏమేం చేస్తారో, దాన్ని గురించి నాకు బాగా తెలుసు.' ఇంకా, విశ్వాసులయిన తన దాసులతో ఆయన ఇలా అన్నాడు- 'విశ్వసించిన ఓ ప్రజలారా! మీరు నేనిచ్చిన ఉపాధిలో నుండి హలాల్ మరియు పరిశుద్ధమయినవి తినండి.''

తరువాత మహాప్రవక్త ఒక వ్యక్తి పరిస్థితిని గురించి వివరించారు. ఒకతను దూర ప్రయాణం చేసి పవిత్రమయిన స్థలం వద్దకు చేరుకున్నాడు. వ్యాకులత చెంది ఉన్నాడు. అతనిపై దుమ్ము ధూళి పడి ఉంది. అయితే అతని పరిస్థితి ఎలాంటిదంటే, అతను తినేది హరామ్ (నిషిద్ధమయిన) తిండి. అతను ధరించే దుస్తులు హరామ్ దుస్తులు. అతని శరీరం హరామ్ తిండితో పోషించబడింది. అలాంటప్పుడు ఆ వ్యక్తి ప్రార్థన ఎలా స్వీకరించబడుతుంది?

## షరతులు

'దుఆ' స్వీకారానికి మరో మూడు షరతులు కూడా ఉన్నాయని ఖుర్ఆన్, హదీసుల ద్వారా రూఢీ అవుతోంది.

1. మానసిక ఏకాగ్రతతో ప్రార్థించాలి.

2 దుఃఖం, విలాపంతో ఆయన్ని అడగాలి.

3. భయంతో, ఆశతో మొరపెట్టుకోవాలి.

మానసిక ఏకాగ్రత అంటే, ప్రార్థన సమయంలో అర్థించేవాడి మనసు తన ప్రభువు వైపుకే లగ్నం అయివుండాలి. 'మనిషి ఒక చోట, మనసు మరో చోట' అన్నట్లు ఉండకూడదు. నోటి ద్వారా దుఆ పదాలను పలుకుతూ ఉన్న సందర్భంలో మనసును వేరేచోట గాలికి వదిలేస్తే -అలాంటి 'దుఆ' వల్ల ప్రాప్తమయ్యేది ఏమీ లేదు.

1. హజ్రత్ అబూహురైరా (ర. అ) ఉల్లేఖించారు :

"వఅలము అన్నల్లాహ లా యస్తజీబు దుఆ అమ్ మిన్ ఖల్బిన్ గాఫిలిన్ లాహిన్."

(కన్జుల్ ఉమ్మాల్-II)

అనువాదం : "మరియు తెలుసుకోండి, ఏమరుపాటుకు గురయిన వాని ప్రార్థనను అల్లాహ్ స్వీకరించడు."

వివరణ : ఇదే అర్థాన్నిచ్చే హదీసు నొకదాన్ని హజ్రత్ అబ్దుల్లా ఇబ్నె ఉమర్ ఉటంకించారు. మనసే అధీనంలో లేనప్పుడు విలాపం మరియు భయభక్తుల ప్రశ్నే తలెత్తదు. కాబట్టి దాసుడు 'దుఆ' చేస్తున్న సమయంలో మనసును తన స్వాధీనంలో పెట్టుకోవాలి, తనేం చేస్తున్నాడు, ఎవరితో విన్నవించుకుంటున్నాడు, ఏం అడుగుతున్నాడు అనే విషయాలపై అదుపు ఉండాలి.

తన సన్నిధానంలో అత్యంత వినమ్రంగా, దీనంగా అర్థించే దాసుడంటే విశ్వప్రభువు ఎంతో సంతోషిస్తాడు, ఆ స్థితిలో దైవకారుణ్యం ఆ వ్యక్తి వైపుకు తప్పక మళ్ళే అవకాశం ఉంది.

2. దివ్య ఖుర్‌ఆన్‌లో తిరస్కారులు, బహుదైవోపాసకుల పరిస్థితిని కూడా వివరించటం జరిగింది. వారు ఎన్నడూ చిత్తశుద్ధితో తమ నిజ ప్రభువు ముందు వినయ వినమ్రతలను చాటరు.

"వలఖద్ అఖజ్ నాహుమ్ బిల్‌అజాబి ఫమస్తకానూ లి రబ్బిహిమ్ వమా యతజర్రవూన్"

(మోమినూన్-76)

అనువాదం : వారి స్థితి ఎలాంటి దంటే, మేము వారిని కష్టాల్లో పడవేసాము. అయినాసరే వారు తమ ప్రభువు ముందు వంగనూ లేదు, వినయాన్ని చూపనూలేదు.

మరొకచోట హెచ్చరించబడింది.

3. ఓ ప్రవక్తా ! వీరిని అడగండి, "ఎడారి, సముద్రాల చీకట్లలో ప్రమాదల నుండి మిమ్మల్ని కాపాడేది ఎవరు? మీరు ఆపద సమయంలో కడు దీనంగా - విలపిస్తూను మరియు అతి గోప్యంగాను వేడుకునేది ఎవరినీ? ఈ ఉపద్రవం నుండి ఆయన గనక మమ్మల్ని రక్షిస్తే, మేము తప్పకుండా కృతజ్ఞులం అవుతాము అని మీరు వేడుకునేది ఎవరితో?- అనండి, అల్లాహ్ మీకు దాన్నుండీ, ఇంకా ప్రతి బాధ నుండీ విముక్తి కలిగిస్తాడు. తరువాత మీరు ఇతరుల్ని ఆయనకు భాగస్వాములుగా నిలబెడతారు."

(అల్ అన్‌ఆమ్-63, 64)

4) దైవ ప్రవక్తలను ఉద్దేశిస్తూ ఖుర్‌ఆన్ అంటోంది.

ఇన్నహుమ్ కాను యుసారివూన ఫిల్ ఖై రాతి వ యద్ ఊననా
రఘబఁవ్వ రహబా. వ కానూలనూ ఖాషియీన్. (అంబియా-90)

అనువాదం:- వీరు సత్కార్యాలలో పరుగెత్తేవారు. మమ్మల్ని భయభక్తులతో పిలిచేవారు మరియు మా సన్నిధిలో వంగి (విధేయులై) ఉండేవారు.

౫. సజ్జనులను ప్రస్తావిస్తూ ఇలా చెప్పబడింది:

"తతజా ఫా జునూబుహుమ్ అనిల్ మజాజియి యద్ వూన
రబ్బహు ఖౌఫఁవ్వ తమఅన్ వ మిమ్మా రజఖ్ నాహుమ్ యున్ఫి
ఖూన్" (సజ్దా—16)

అనువాదం:- వారి వీపులు వారి పడకల నుంచి వేరుగా ఉంటాయి. వారు తమ ప్రభువును భయంతోనూ, శ్రద్ధతోనూ పిలుస్తారు. ఇంకా వారు, మేమిచ్చిన దానిలోనుండి మా మార్గంలో ఖర్చు చేస్తారు.

వివరణ - మనం మన ఆరాధనలు దుఆలుపై ఆయత్‌లలోని ఆదేశాల కనుగుణంగా ఉన్నాయో లేవో పోల్చి చూసుకోవాలి. మనలోని లోపాలను, పొరబాట్లను సరిదిద్దు కోవటానికి కృషిచేయాలి అప్పుడు మన నిజమయిన లక్ష్యం నెరవేరుతుంది.

# "దుఆ"లో ఆక్షేపణాలు

దుఆ (ప్రార్థన)లో అభ్యంతరకరమయిన విషయాలు కూడా కొన్ని ఉన్నాయి, ఎందుకంటే అవి ప్రార్థనా స్వభావానికి, రీతులకు విరుద్ధమైనవి. సోదాహరణంగా వాటిని ఇక్కడ పొందుపరచటం జరిగింది.

## నిర్లక్ష్య ధోరణి:-

1. "ప్రార్థన"లో అల్లాహ్‌పై ఛాలెంజ్ చేసే ధోరణిని అవలంబించటం సరైనది కాదు. ఏది అడిగినా స్పష్టంగా, సమంజసమయిన పద్ధతిలోనే ఆయన్ని అడగాలి.

బుఖారి షరీఫ్‌లో ఉంది:

"అన్ అబీహురైరత ఖాల ఖాల రసూలుల్లాహి సల్లల్లాహు అలైహి వసల్లం ఇజాద ఆ అహదుకుమ్ ఫలా యఖుల్ అల్లాహుమ్మ గ్ఫిర్లీ ఇన్‌షిత అల్లాహుమ్మ రహమ్ని ఇన్‌షిత వలాకిన్ లియ అజిమల్ మస్ అలత ఫయిన్నల్లామా లా ముక్రిహాలహు"

అనువాదం:- "హజ్రత్ అబూహురైర (ర. అ) ఉల్లేఖించారు- ప్రవక్త ముహమ్మద్ (స అసం) ప్రవచించారు: మీలో ఎవరయినా దుఆ చేస్తే, ఓ దేవా! నీవు గనక తలిస్తే నన్ను క్షమించేయి, నీవు తలచుకుంటే నన్ను అనుగ్రహించు అని అనరాదు. దీనికి బదులు సమగ్రంగా, స్పష్టంగా ప్రార్థించాలి. ఎందుకంటే అల్లాహ్‌పై జబర్దస్తీ చేసేవాడు ఎవడూ లేడు"

వివరణ:- అల్లాహ్ గనక తలుచుకోకపోతే ఆయన చేత బలవం తంగా ఎవరూ, ఏదీ పొంద జాలరనే విషయం అందరికీ విదితమే.

## కవితా ధోరణి

2. 'దుఆ' లో మొహమాటం కొద్ది స్పష్టంగా అడగకుండా కవితా ధోరణిలో పదాలు అల్లడం, డొంకతిరుగుడు విధంగా అర్థించటం సమంజసం కాదు. ఈ విధంగా చేస్తే 'దుఆ' లో చిత్తశుద్ధి, మానసిక ఏకాగ్రత లోపిస్తాయి. భయ భక్తులు అసలే మిగిలి ఉండవు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (ర. అ) ఒకసారి తన శిష్యుడు హజ్రత్ అక్రమకు హితబోధ చేశారు. వాటిలో ఒక ఉపదేశం ఇలా వుంది:

3. "ఫన్‌జురిస్సజ్‌ఆ మినద్దుఆయి ఫజ్‌తనిబ్‌హు ఫయిన్ని అహిత్తు రసూలల్లాహి సల్లల్లాహు అలైహి వ సల్లం వ అస్‌హాబహు లా యఫ్‌అలూన జాలిక్."

(బుఖారి)

అనువాదం :- 'దుఆ'లో పదాల కూర్పు (కవితా ధోరణి)కి దూరంగా ఉండండి. ఎందుకంటే, మహాప్రవక్త గాని, ఆయన సహచరులు గాని ఇలా చేయటాన్ని నేనెన్నడూ చూడలేదు."

## మితిమీరటం

4. 'దుఆ' (ప్రార్థన)లో మితిమీరి వ్యవహరించటం, గంపెడు కోర్కెలు కోరటం కూడా సబబు కాదు. దివ్య ఖుర్‌ఆన్ యందలి ఆరాఫ్ సూరాలో చెప్పబడింది.

"మీ ప్రభువును పిలవండి - దీనంగా, లోలోపల. నిస్సందేహంగా ఆయన హద్దు దాటి ప్రవర్తించేవారిని ఇష్టపడడు."

(ఆరాఫ్-55)

'దుఆ' లో హద్దు మీరి వ్యవహరించే విధానాలు రెండున్నాయి ·

**(అ) హరామ్ (అధర్మమయిన) వస్తువులను కోరటం :**

దుఆలో విపరీతమయిన కోర్కెలు కోరటాన్ని అధర్మంగా, మితిమీరటంగా అభిప్రాయపడ్డారు వ్యాఖ్యాతలు. ఇలా చేయుటం దుఆ వాస్తవికతకే విరుద్ధం. ఇలాంటి దుఆల వల్ల మనిషి తనను తాను దైవాగ్రహానికి లోను చేసుకుంటాడు.

ఉదాహరణకు ఎవరయినా వడ్డీ వ్యాపారం చేస్తూ, ఆ వ్యాపారంలో దైవం తనకు వృద్ధీ వికాసాలు అనుగ్రహించాలని ప్రార్థించాడంటే. అతడు తనకు తానై దైవాగ్రహానికి లోను చేసుకుంటున్నాడన్నమాట ఎందుకంటే, వడ్డీ లావాదేవీలను దివ్య ఖుర్‌ఆన్ హరామ్‌గా నిర్ధారించింది, వడ్డీ వ్యాపారం చేసేవారు నరాసరి అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తలతో యుద్ధం కొరకు ఛాలెంజ్ చేయడంతో సమానమని ఖుర్‌ఆన్ హెచ్చరించింది. కనుక ఫలాన వస్తువులు ధర్మ సమ్మతమయినవి అని తెలిసిన మీదటే వాటి కోసం దైవ సన్నిధిలో వేడు కోవాలి.

**(ఆ) బిగ్గరగా మొరపెట్టు కోవటం :**

అవసరం లేనపుడు బిగ్గరగా దుఆ చేయడం సబబయింది కాదు. దివ్య ఖుర్‌ఆన్, ఆరాఫ్ సూరాలో చెప్పబడింది :

i) మీ ప్రభువును లోలోపల వేడుకొనండి

ii ) మితిమీరి వ్యవహరించే వాడంటే అల్లాహ్ ఇష్టపడడు.

అనవసరంగా బిగ్గర గొంతుతో పిలవటం అన్న విషయం కూడా 'మితి మీరి వ్యవహరించటం' లో నిబిడీకృతమయి ఉంది. నెమ్మదిగా, లోలోపల వేడుకునే దాసులంటేనే నిజ ప్రభువు అధికంగా సంతోషిస్తాడని ఖురాన్, హదీసుల వెలుగులో నిర్ధారిత మవుతోంది.

బుఖారి, ముస్లిం గ్రంథాలలో అబూమూసా అష్అరి (ర. అ) ఉల్లే ఖనం ఒకటి ఉంది:

"జిహాద్ ప్రయాణంలో సహాబా (ప్రవక్త సహచరులు) బిగ్గరగా తక్బీర్ చెప్పసాగారు. అప్పుడు దైవ ప్రవక్త (సఅసం) వారించారు: ఇంకా ఆయన (సఅసం) ఉపదేశించారు- 'మీరు చెవిటి వాడినో, దూరంగా ఉన్న వాడినో పిలవటం లేదు. మీరు, మీకు దగ్గరగా ఉన్న, అంతా ఆలకిస్తూ ఉన్న శక్తివంతుణ్ణి అర్థిస్తున్నారు. ఆయన మీకు తోడు ఉన్నాడు.

(ఇ) అనవసరంగా పదాలను రెట్టించటం :

ప్రవక్త ముహమ్మద్ (సఅసం) సమగ్రమయిన దుఆలను ఇష్టపడే వారు : అనవసర పదాల గుంభనాన్ని ఆయన (సఅసం) వారించేవారు. ఉదాహరణకు కొన్ని ప్రవచనాలను పేర్కొంటున్నాము.

"అన్ ఆయిషత రజి అల్లాహు అన్హా ఖాలత్ కాన రసూలుల్లాహి (సఅసం) యస్తహిబ్బుల్ జవామి అ మినద్దుఆయి వ యదవూ మాసివా జాలిక్"

(మిష్కాత్, బహవాలయె అబూదావూద్)

అనువాదం :- హజ్రత్ ఆయిషా (రజి అల్లాహు అన్హా) అన్నారు- 'మహనీయ ముహమ్మద్ (సఅసం) సమగ్రమయిన దుఆలు అంటే ఇష్ట పడేవారు. (దుఆలో) అనవసరమయిన విషయాలను విడిచిపెట్టేసేవారు'

('మిష్కాత్'-అబూదావూద్ ఆధారంగా)

వివరణ :- 'సమగ్రమయిన ప్రార్థన' యొక్క భావం ఏమంటే; ఆయన (సఅసం) దుఆలో ప్రాపంచిక, పారలౌకిక సాఫల్యాలు - రెంటిని గురించీ వేడుకునేవారు. ఆయన ప్రార్థనలో పదాలు తక్కువగా ఉండేవి. భావపరంగా అది చాలా పరిపూర్ణంగా ఉండేది. క్షమాభిక్షకు ఆయన (సఅసం) ఎక్కువ ప్రాధాన్యత నిచ్చేవారు. దుఆలో అనవసరంగా పెద్ద పెద్ద పదజాలాలు వాడి సమయాన్ని వృథా చేసేవారు కాదు.

ఒక హదీసులో (ఉంది). హజ్రత్ అబ్దుల్లాబిన్ మగ్ఫిల్, తన కుమారుడు ఈ విధంగా ప్రార్థించటం విన్నారు :

"ఓ దేవా! స్వర్గానికి కుడివైపున నాకు తెల్లటి మహలు నొకదాన్ని (నిర్మించి) ఇవ్వమని అర్థిస్తున్నాను."

ఇది విని హజ్రత్ అబ్దుల్లాబిన్ మగ్ఫిల్ ఆక్షేపించారు. ఆయన చెప్పారు:

'స్వర్గాన్ని అనుగ్రహించమని, నరకం నుండి రక్షించమని వేడుకో ఈ సమాజంలో-వుజూ మరియు దుఆలో మితిమీరి ప్రవర్తించేవారు వస్తారని మహాప్రవక్త (స అసం) సెలవీయగా నేను విన్నాను.

ఉజూలో మితిమీరి ప్రవర్తించటం అంటే, 'వుజూ' చేస్తే

టప్పుడు ప్రతి అవయవాన్ని అనవసరంగా 3 సార్ల కంటే ఎక్కువగా కడగటం.

### (ఈ) దుఆ ను ఉపన్యాసంగా చేసి వేయటం:

నేడు కొంతమంది 'దుఆ'ను ఉపన్యాసంగా మార్చి వేయటాన్ని మనం చూస్తూనే ఉన్నాం. దుఆకీ-సుదీర్ఘమయిన ఉపన్యాసానికీ తేడా లేకుండా పోతోంది. ఇలా చేయటం, దుఆ నియమాలను ఉల్లంఘించటంతో సమానమే. ఈ ధోరణికి స్వస్తి చెప్పాలి.

### (ఉ) స్థాయికి మించిన కోర్కెలు

మనిషి తన స్థాయికి మించిన కోర్కెలు కోరటం కూడా దుఆ పరిధి దాటటంగానే పరిగణించబడుతుంది. ఉదాహరణకు, దేవుడు తన ప్రవక్తలకు ఇచ్చిన హోదాను ప్రత్యేకతలను, రాయితీలను తమకు కూడా కావాల్సిందేనని కోరితే అది విపరీతమే కదా!

మరొకరెవరయినా దైవంపై తిరస్కారం, తిరుగుబాటు వైఖరిని అవలంబిస్తూనే, తనను స్వర్గం ప్రసాదించాలని దైవాన్ని కోరితే, అది కూడా ప్రార్థనా నియమాలకు విరుద్ధమే. స్వర్గంలో స్థానం కల్పించమని అర్థించేముందు అతను పాపకార్యాల నుండి తనను రక్షించుకోవాలి. పశ్చాత్తాపం ప్రకటించాలి. దైవ విధేయత కోసం వేడుకోవాలి.

## 'దుఆ' పద్ధతులు

భొమ్మ వరకు రెండు చేతులను ఎత్తి అడగటం, దుఆ పూర్తయిన పిదప రెండు చేతులనూ ముఖంపై నుండి త్రిప్పుకోవటం-దుఆ యొక్క

ఉత్తమ పద్ధతి. ప్రార్థించే వ్యక్తి 'ఉజూ'తో ఉండి, 'ఖిబ్లా' (పడమట దిశ) వైపుకు తిరిగే ఉంటే చాలా మంచిది. నమాజ్ అనంతరం దుఆ చేసేవారు పై నియమాలను సులువుగా పాటించగలుగుతారు.

దుఆకు ముందు దైవస్తోత్రాన్ని కొనియాడటం, ప్రవక్త(సఅసం)పై దరూద్ పంపటం, దుఆ తరువాత 'ఆమీన్' అని పలకటం-ఇవన్నీ దుఆ నియమాలలోకే వస్తాయి. ఈ నియమాలన్నీ మహాప్రవక్త (సఅసం) ప్రవచనాల ఆధారంగా నిర్ధారించబడినాయి.

# దుఆ కోసం సరైన సమయం

రోజూ ఐదుపూటల నమాజ్ లాగా దుఆల కోసం కూడా నిర్ణీత సమయాలను షరీఅత్ సూచించలేదు. ఏ సమయంలో, ఏ పరిస్థితి లోనయినా దుఆ చేయవచ్చు. అయితే కొన్ని మంచి వేళలు. శుభ ఘడియలను ఎంపిక చేసుకోవటం వలన దుఆల స్థాయి ఔన్నత్యం పెరగగలదని ఆశించవచ్చు అని హదీసుల ద్వారా తెలుస్తోంది.

ఇమామ్ గజాలి, ఇతర పండితులు, సూఫీలు ఆయా మంచివేళలను సంకలనం చేశారు.

1. వాటిలో ఒక సమయమయితే ఏడాదికి ఒకసారి వస్తుంది. అదే "అర్ఫా రోజు" (హజ్ యాత్రికులు 9వ రోజున అరఫాత్ మైదానంలో గడిపేరోజు).

2. సాలీనా 12 నెలలలో ఒక నెల-రమజాన్ నెల - అందులోనూ ప్రత్యేకంగా ఒకరాత్రి-లైలతుల్ ఖద్ర్ (ఘనమయిన రాత్రి).

3. కొన్ని సమయాలు ప్రతి వారం వస్తుంటాయి. ఉదాహరణకు శుక్రవారపు రేయి మరియు పగలు. ముఖ్యంగా, జుమాలో రెండు ఖుత్బాలకు (ప్రసంగాలకు) మధ్య ఉండే సున్నితమయిన వ్యవధి. మరియు సూర్యాస్తమయానికి కొంచెం ముందు.

4. కొన్ని వేళలు ప్రతిరోజూ వస్తుంటాయి ఉదాహరణకు జాము రాత్రి-ఉషోదయానికి ముందు.

5. ఫర్జ్ నమాజ్‌ల తరువాత.

6. అజాన్ మరియు ఇఖామత్‌ల సమయంలో.

7. వర్షం పడే సమయంలో.

8. 'సజ్దా' చేసిన సమయంలో వేడుకొనటాన్ని కూడా అత్యంత శుభప్రదమయినదిగా చెప్పటం జరిగింది.

9) రోజేదార్ (ఉపవాసి) ఉపవాస విరమణ చేసేముందు.

10) బాటసారి ప్రయాణానికి బయలు దేరేముందు, ప్రయాణంలో ఉండగా,

11) తప్పనిసరి పరిస్థితుల్లో చేసే ప్రార్థన

12) అల్లాహ్ గొప్పదనాన్ని, ప్రళయ దినపు ప్రకంపనను తలచు కొని వళ్లు జలదరించేటప్పుడు చేసే వేడుకోలు.

## 'ప్రార్థన' పరమార్థం?

1) దాసుడు, తన ప్రార్థన స్వీకరించబడేందుకుగాను తన ప్రభువు ఎదుట చేతులు చాచి ఉంచాలి. ప్రార్థన కేవలం ఆరాధనే కాదు, అది ఆరాధనా సారం కూడా. ప్రార్థన యొక్క అసలు ప్రతి ఫలం ప్రపంచం కాదు, పరలోక సుఖం.

2. దుఆ చేసిన వ్యక్తి, తన దుఆ అన్ని విధాలా స్వీకారయోగ్యం అవుతుంది అని భ్రమపడతాడు. అయితే దుఆకు ఉండవలసిన కనీస అర్హతలను, నియమ నిబంధనలను తాను పాటించాడా లేదా అన్న విషయాన్ని గురించి అతను ఎందుకు ఆలోచించడు? ! తన ప్రభువు పిసినారి కాదనీ,

ఆయన ధనాగారంలో ఎలాంటి లోటూ లేదని, ఆయన కరుణామయుడని తెలిసిన మీదట కూడా-తన ప్రభువు సన్నిధానంలో తన వేడుకోలు ఆమోద ముద్రకు నోచుకోవటం లేదంటే-దానికేదో బలమయిన కారణం ఉండి ఉంటుంది అని అతడు ఎందుకు యోచించటం లేదు??

దాసుడు అడిగినదల్లా దేవుడు ఇస్తూనే ఉండాలి అని ఎక్కడా లేదు. అది దుఆ వాస్తవికతకే విరుద్ధం.

మానవ నైజంలో తొందరపాటు తనం, దూకుడుస్వభావం ఉన్నాయి గనకనే, వాటి దుష్ప్రభావాలనుండి అతన్ని రక్షించేందుకు మహాప్రవక్త (సఅసం) ఒక చక్కని ఉపదేశం చేశారు.

"విశ్వాసి ప్రార్థన ఎన్నటికీ త్రోసిపుచ్చబడదు. పైగా అది నిత్యం స్వీకరించబడుతూనే ఉంటుంది. కాకపోతే, అది స్వీకరించబడే తీరు విభిన్నంగా ఉంటుంది."

# విశ్వాసి 'దుఆ' రద్దు కాదు

1. "అన్ సల్మాన ఖాల ఖాల రసూలల్లాహి సల్లల్లాహు అలైహి వసల్లం ఇన్న రబ్బకుమ్ హయియ్యున్ కరీమున్ యస్త హ్యియీ మిన్ అబ్దిన్ ఇజా రఫఅ యదైహి ఇలైహి అఁయ్యు రుద్ద హుమా సిఫ్రా"

(తిర్మిజి, అబూదావూద్, బైహిఖి)

అనువాదం:- హజ్రత్ సల్మాన్ ఫార్సి (ర. ఉ) ఉల్లేఖించారు -మహా ప్రవక్త (సఅసం) ప్రవచించారు- "నిస్సందేహంగా మీ ప్రభువు లజ్జా గుణం కలవాడు, కరుణామయుడు. ఎప్పుడయినా తన దాసుడు తన వైపుకు చేయిచాస్తే, అతన్ని వట్టి చేతులతో త్రిప్పి పంపడానికి ఆయన సిగ్గుపడతాడు.

2. "అన్ అబీ సయీ దిన్ అన్ అనిన్నబియ్యి సల్లల్లాహు అలైహి వసల్లమ మా మిన్ ముస్లిమిన్ యదవు బి దావతిన్ లైసఫీహ ఇస్మున్ వలాఖతయీయతు రహ్మిన్. ఇల్లా ఆతా హుల్లాహు బిహీ యహ్దా సలాసిన్ ఇమ్మా అఁయ్యుజఅల లహు దావతహు వ ఇమ్మా అఁయ్యద్ద ఖిరహు లహు ఫిల్ ఆఖిరతి వ ఇమ్మా అఁయ్యస్‌రిఫ అన్‌హు మినస్సూయి మిస్లహా ఖాలు ఇజం కసర ఖాలల్లాహు అక్సర్"

(తర్ఘీబ్ వ తర్హీబ్, బిహవాలిహ్ ముస్నద్ వ అహ్మద్ వ బజార్ వ అబూయాల)

అనువాదం :- మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారని హజ్రత్ అబూసయీద్ ఖుదరి (ర.అ) ఉల్లేఖించారు : ఎప్పుడయినా ఒక ముస్లిం ఎలాంటి దోషం గాని, సంబంధాన్ని త్రెంచే అంశం గాని లేని 'దుఆ' గనక చేస్తే, అల్లాహ్ అతనికి మూడు వస్తువులలో ఏదో ఒకటి ప్రసాదిస్తాడు.

1. దాసుడు అడిగినది అడిగినట్లు ప్రపంచంలోనే ఇస్తాడు. 2. దాని ప్రతిఫలాన్ని అతని కోసం పరలోక నిధిగానయినా మారుస్తాడు. 3. అడిగిన దానికి బదులుగా దాసుడ్ని ఇతర కష్టాలనుండయినా కడతేరుస్తాడు', (ఇది విని) సహచరులు అన్నారు - 'అయితే మేము అత్యధికంగా ప్రార్థిస్తాము', మహాప్రవక్త (సఅసం) అన్నారు : "అల్లాహ్ ధనాగారం అంతకంటే అధికమయినదే".

# మక్కాలో ప్రార్థన స్వీకరించబడే ప్రత్యేక స్థలాలు

ఇమామ్ హుసైన్ బస్రి (ర.లై) మక్కావాసుల పేరిట ఓ లేఖ రాస్తూ, (మక్కాలో) దుఆ స్వీకరించబడే 15 స్థలాలను వివరించారు. ఆ 15 స్థలాలు ఇవి:

1. తవాఫ్ చేసే చోట
2. ముల్తజమ్ ఉన్నచోట (ఇది హజ్రె అస్వద్-కాబా గృహపు ద్వారం మధ్యన ఉంది)
3, మీజాబ్ క్రింద
4. బైతుల్లాహ్ లోపల
5. జమ్ జమ్ నీటి వద్ద
6. సఫా గుట్టపైన
7. మర్వా గుట్టపైన
8. మస్ఆ (సఫా-మర్వాల మధ్య పరుగెత్తే స్థలం)లో
9. "ముఖామె ఇబ్రాహీం" వెనుక
10. అరఫాత్ మైదానంలో (జిల్‌హజ్ 9న సూర్యోదయం మొదలుకుని సూర్యాస్తమయం వరకు హాజీలు ఇక్కడ ఉంటారు. ఇదే అసలు హజ్ యొక్క ప్రధాన విధి)

11. ముజ్దలిఫాలో (అరఫాత్ మైదానం నుండి వాపసు అయిన మీదట హాజీలు ఇక్కడ మగ్రిబ్, ఇషా నమాజ్‌లు చేసి రాత్రి యిక్కడే బస చేస్తారు)

12. మినాలో (ఇక్కడ 10వ రోజున హాజీలు జమ్రాపై కంకర రాళ్ళు రువ్వి, ఖుర్బానీ ఇస్తారు )

13. 14, 15, ఇక్కడ మూడు జమ్రాలు ఉన్నాయి. వాటిపై హాజీలు రాళ్లు రువ్వుతారు.

# దైవ సన్నిధిలో ఎవరి ప్రార్థనలు ప్రత్యేకంగా స్వీకరించబడతాయి?

సహాబాలు ఉటంకించిన హదీసుల ను బట్టి క్రింద ప్రస్తావించబడిన వారి దుఆ లు (ప్రార్థనలు) దైవ సన్నిధిలో ప్రత్యేకంగా ఆమోదించబడతాయని నిర్ధారణ అవుతోంది:

1. బలహీనులు, నిస్సహాయులు, దీనులయిన వారి ప్రార్థన
2. పీడితులు, బాధలకు గురయినవారు (ఒకవేళ వీరు పాపిష్టులయినప్పటికీ, తిరస్కారులయినప్పటికీ వీరి దుఆ స్వీకారయోగ్యమవుతుందని రెండు ఉల్లేఖనాల ద్వారా రూఢీ అవుతోంది).
3. తండ్రి తన సంతానం కోసం చేసే ప్రార్థన.
4. న్యాయ శీలుడయిన నాయకుని దుఆ (న్యాయ, ధర్మం కోరే ఖలీఫా గాని, చక్రవర్తిగానీ తన రాజ్య ప్రజల కోసం చేసే ప్రార్థన అన్నమాట.)
5. సద్వర్తనులయిన ప్రతి ఒక్కరి దుఆ.
6. తల్లిదండ్రుల యెడల ఉత్తమంగా వ్యవహరించే సేవకులయిన సంతానం తమ తల్లిదండ్రులకై చేసే ప్రార్థన.

7. బాటసారి ప్రార్థన.

8. ఉపవాసి ప్రార్థన- ఉపవాస విరమణ చేసే కొద్దిసేపు ముందు.

9. ఒక ముస్లిం పరొక ముస్లిం సోదరుని కోసం చేసే దుఆ.

10. వేరొకరిపై దౌర్జన్యం చెయ్యకుండా, పరుల నష్టాన్ని కోర కుండా ఉన్నంతవరకు-ప్రతి ముస్లిం ప్రార్థన ఆమోదం పొందు తుంది. (అయితే ఒక షరతు, అతడు దుఆ చేసిన తరువాత నిరాశకు తావు ఇవ్వకూడదు. తాను ప్రార్థన చేసినా దాన్ని దేవుడు స్వీకరించనేలేదు అనే ఆరోపణ కూడా చెయ్యరాదు)

11. ఒక హదీసులో ఉంది—

"దేవుని, స్వేచ్ఛా జీవులయిన కొందరు (నరకయాతన నుండి విముక్తి పొందిన) దాసులు ఉన్నారు. వారిలో, ప్రతి ఒక్కరి రేయింబవళ్ళలో ఒక దుఆ తప్పనిసరిగా స్వీకరించబడుతుంది.

జామె అబూ మన్సూర్‌లో (ఒక ఉల్లేఖనం) ఉంది : "నిజమయిన ప్రార్థన హాజీది అవుతుంది - అతడు (హజ్ నుండి తన ఇంటికి) తిరిగి వచ్చేదాకా ;"

# ఘనమైన పేరు దుఆ స్వీకారంపై దాని ప్రభావం

1. ఒక హదీసులో ఉంది:-

దేవుని ఘనమయిన పేరు *(ఇస్మె ఆజమ్) ఒకటుంది. ఆ పేరును ఉచ్చరిస్తూ ఏ దుఆ చేసినాసరే అల్లాహ్ దాన్ని స్వీకరిస్తాడు. ఏది అడిగినా తప్పక మన్నిస్తాడు అల్లాహ్. ఇక్కడ ఇలా పేర్కొనబడింది:

"లా యిలాహ ఇల్లా అన్త సుబ్‌హానక ఇన్ని కున్తు మిన జ్జాలిమీన్"

అనువాదం:-"(ఓ అల్లాహ్!) నీవు తప్ప మరో ఆరాధ్య దైవం లేడు నీవు పవిత్రుడవు. నిస్సందేహంగా నేనే జులుం చేసే వారిలోని వాడను."

---

* ఏ విధంగానయితే లైలతుల్ ఖద్ర్ మరియు శుక్రవారం నాటి ఒక విలువయిన ఘడియ ఎప్పుడు ఉన్నదీ స్పష్టంగా నిర్ధారించబడలేదో అదే విధంగా దేవుని సదరు ఘనమయిన పేరు ఏదో కూడా ఖచ్చితంగా, సుస్పష్టంగా చెప్పబడలేదు. దాసులు వీలయినంత ఎక్కువగా అల్లాహ్ పేర్లను స్మరించి ఉత్తమ ప్రతిఫలం పొందాలన్నదే దీని పరమార్థం అయి ఉండవచ్చు.

2. మరొక హదీసులో ఉంది--

"తన యొక్క ఘనమయిన పేరు (ఇస్మెఆజమ్)తో పాటు అల్లాహ్‌ను ఏది అడిగినా ఆయన (తప్పక) ఇస్తాడు. ఏ ప్రార్థన చేసినా ఆయన దాన్ని (తప్పక) స్వీకరిస్తాడు.

"అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక బి అన్నీ అష్హదు అన్నక అన్తల్లాహు లా యిలాహ ఇల్లా అన్తల్ అహదుస్సమదుల్లజీ లమ్‌యలిద్ వలమ్ యూలద్ వలమ్ యకుల్లహు కుఫువన్ అహద్"

అనువాదం :- "దేవా ! నేను నిన్ను అడుగుతున్నాను - ఎందుకంటే; నువ్వే అల్లాహ్ అనీ, నువ్వు తప్ప మరొక ఆరాధ్యదైవంలేడనీ, నువ్వు ఒక్కడివేననీ, అతీతుడవనీ, నువ్వు ఎవరికీ సంతానం కాదనీ, నువ్వు ఎవరినీ కనలేదనీ, ఇంకా, నీకు సహవర్తులు ఎవరూ లేరని నేను సాక్ష్యమిస్తున్నాను కాబట్టి (నేను నిన్నే వేడుకుంటున్నాను).

ఇదే హదీసు మరికొన్ని ఉల్లేఖనాలలో ఈ విధంగా ఉంది :-

"అల్లాహుమ్మ ఇన్ని అస్అలుక బి అన్నక అన్తల్లాహుల్ అహదుస్సమదుల్లజీ లమ్‌యలిద్ వలమ్ యూలద్ వలమ్ యకుల్లహు కుఫువన్ అహద్"

అనువాదం :- దేవా ! నేను నిన్ను అడుగుతున్నాను. ఎందుకంటే, నీవే దేవుడవు, ఏకేశ్వరుడవు, అతీతుడవు. ఆయనకు ఎవరూ పుట్టలేదు. ఆయన ఎవరికీ పుట్టలేదు. ఇంకా ఆయనకు ఎవరూ సహవర్తులు లేరు.

3. మరికొన్ని ఉల్లేఖనాలలో
"యా జల్‌జలాలి వల్ ఇక్రామ్"

(ఓ ఘనత వహించిన వాడా! కరుణాకరా!!) అని పేర్కొనబడింది.
ఇంకా కొన్ని ఉల్లేఖనాలలో,
"యా హయ్యు, యా ఖయ్యూమ్"

(ఓ నిత్యుడా! అజరుడా! విశ్వవ్యవస్థకు మూలాధారకుడా!) అని పేర్కొనబడింది.

4. ఘనమయిన పేరు (ఇస్మె ఆజమ్) క్రింద యివ్వబడిన రెండు ఆయత్‌లలోనే ఉందని మరొక హదీసు ద్వారా బోధపడుతోంది:

(అ) వ ఇలాహుకుమ్ ఇలాహువ్వాహిదున్ లా యిలాహ
ఇల్లా హువర్రహ్మానుర్రహీమ్, (అల్‌బఖర-163)

(మరియు మీ దేవుడు ఒకే దేవుడు. ఆయన తప్ప మరో దేవుడు లేడు ఆయన కరుణామయుడు మరియు కృపాశీలుడు)

(ఆ) అలిఫ్ లామ్ మీమ్. అల్లాహు లా యిలాహ ఇల్లా హువల్
హయ్యుల్ ఖయ్యూమ్. (ఆలి ఇమ్రాన్-1,2)

(అలిఫ్ లామ్ మీమ్. అల్లాహ్-సజీవుడు, నిత్యుడు, విశ్వవ్యవస్థకు ఆధార భూతుడు)

5. ఇంకొక హదీసు ప్రకారం దేవుని ఘనమయిన నామం మూడు సూరాలలో ఉంది:

ఒకటి- బఖరా సూరా
రెండు- ఆలి ఇమ్రాన్ సూరా
మూడు - తాహా సూరా

6. * ఖాసిమ్ బిన్ అబ్దుర్రహ్మాన్ పలికారు-

"నేను ఈ (పైన పేర్కొనబడిన) హదీసు ప్రకారం ఘనమయివ పేరు అన్వేషణ జరిపాను. అయితే "అల్ హయ్యుల్ ఖయ్యూమ్" దేవుని యొక్క గొప్ప పేరని తలపోశాను.

7. "హిస్నెహసీన్" గ్రంథ రచయిత ఇమామ్ జజరి (ర.లై) అభిప్రాయపడ్డారు-.

"నా దృష్టిలో 'అల్లాహు లా యిలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూమ్' గొప్ప పేరు.

---

* ఈయన అబ్దుర్రహ్మాన్ గారి కుమారులు సిరియా దేశస్థులు. హజ్రత్ అబూ ఉమామ (ర.అ) గారి నమ్మకస్థులైన శిష్యులు.

# ఉదయం - సాయంత్రం చేయవలసిన 'దుఆ'లు

1. ప్రతిరోజూ మూడు సార్లు ఈ 'దుఆ' చేయాలి :

"బిస్మిల్లా హిల్లజీ లా యజుర్రూ మఅస్మిహీ షయ్యున్ ఫిల్ అర్జి వలా ఫిస్సమాయి వహువస్సమీవుల్ అలీమ్"

అనువాదం :- "ఆ దేవుని పేరుతో- ఎవరి పేరుతో పాటు ఏ వస్తువు కూడా భూమిలోనూ, ఆకాశంలోనూ నష్టం చేకూర్చజాలదో; ఆయన (అన్నీ) వినేవాడు, (అన్నీ) ఎరిగిన వాడు."

వివరణ:- (అ) ఎవరయితే ఈ 'దుఅ'ను ఉదయం, సాయంత్రం మూడేసిసార్లు చేస్తారో వారిని అల్లాహ్ అకస్మాత్తుగా సంభవించే అన్నిరకాల విపత్తుల నుండి రక్షిస్తాడు.

(ఆ) ఈ 'దుఆ' ను ఉదయం పూట చేసినపుడు మనసులో "అస్బహ్నా" (మేము ఉదయం గడిపాము) అనీ, సాయంత్రం పూట ఈ దుఆ పఠించినపుడు "అమ్ సయ్‌నా" (మేము సాయంత్రం గడిపాము) అనీ అనాలి.

2. మూడు సార్లు ఇలా ప్రార్థించాలి-

"అవూజు బి కలిమాతిల్లా హిత్తా మ్మాతి మిన్‌షర్రి మా ఖలఖ్"

అనువాదం:- నేను అల్లాహ్ యొక్క సంపూర్ణమయిన సద్వచనాల రక్షణ పొందుతాను. ఆయన యొక్క ప్రతి సృష్టిరాశి కీడు నుండి రక్షణ పొందుతాను."

వివరణ:- ఏ వ్యక్తయితే ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం ఈ 'దుఆ'ను మూడేసిసార్లు పఠిస్తారో వారిని అల్లాహ్ తన ప్రతి సృష్టిరాశి నుండి- ముఖ్యంగా పాము, తేలు మొదలగు విషపూరిత చరాల బారి నుండి రక్షిస్తాడు. ప్రత్యేకంగా రాత్రిపూట!

కొన్ని ఉల్లేఖనాలలో, కేవలం సాయంత్రం పూట మూడేసిసార్లు ఈ దుఆ చేస్తే చాలని పేర్కొనబడింది.

3. మూడేసి సార్లు ఈ 'దుఆ' చదవండి:

"అవూజు బిల్లాహిస్సమీయిల్ అలీమ్. మినష్షయితా నిర్రజీమ్"

(నేను షైతాన్ బారినుండి సర్వం వినేవాడు, ఎరిగేవాడయిన అల్లాహ్ రక్షణ పొందుతున్నాను)

ఆ తరువాత హష్ర్ సూరాకు చెందిన చివరి ఆయత్‌లు పఠించండి:-

"హువల్లా హుల్లజీ లా యిలాహ ఇల్లా హువ ఆలిముల్ గైబి వష్షహాదతి హువర్రహ్మానుర్రహీమ్. హువల్లాహుల్లజీ లా యిలాహ ఇల్లాహువా, అల్ మలికుల్ ఖుద్దూ సుస్సలాముల్ మూమి

నుల్ ముహైమినుల్ అజీజుల్ జబ్బారుల్ ముతకబ్బిర్. సుబ్‌హాన ల్లాహి అమ్మా యుష్రికూన్, హువల్లాహుల్ ఖాలిఖుల్ బారి ఉల్ ముసవ్విరూ లహుల్ అస్మా వుల్‌హుస్నా యుసబ్బిహు లహు మాఫిస్సమావాతి వల్ అర్జ్ వహువల్ అజీజుల్ హకీమ్."

అనువాదం - అల్లాహ్ ఆయనే. ఆయన తప్ప మరో ఆరాధ్య దేవుడు లేడు. ఆయన గోచర అగోచరాలను అన్నింటినీ ఎరిగినవాడు. ఆయన అపార కరుణామయుడు, పరమ కృపాశీలుడు. అల్లాహ్ ఆయనే-ఆయన తప్ప మరొక రెవరూ ఆరాధనకు అర్హులు కారు. ఆయనే (యావత్ప్రపంచానికీ] పాదుషా, అత్యంత పవిత్రుడు, ఏ లోపమూ లేని వాడు, శాంతిని ఒన గూర్చేవాడు, సంరక్షకుడు. (అందరిపై) ఆధిపత్యం కలవాడు, ఘనుడు, గొప్పదనానికి యజమాని. ముష్రికులు (బహు దైవో పాసకులు) ఏ "షిర్క్" నయితే చేస్తున్నారో దానికి ఆయన అతీతుడు, పవిత్రుడు. అల్లాహ్ ఆయనే - (అందరినీ) సృష్టించేవాడు, శూన్యం నుండి అస్తిత్వాన్ని బయటికి తీసేవాడు, రూపకల్పన చేసేవాడు; ఉత్తమ పేర్లన్నీ ఆయనకే ఉన్నాయి. భూమ్యాకాశాల్లో ఉన్న ప్రతి వస్తువూ ఆయన పవిత్రతను కొనియాడుతున్నాయి. ఆయనే అందరిపై అధికారకుడు మరియు వివేకవంతుడు."

వివరణ:- హష్ర్ సూరాయందలి ఈ మూడు మహోన్నత ఆయత్‌లను క్రింద పేర్కొనబడిన 'కలిమా'లతోపాటు పఠించటాన్ని గొప్ప

5. ఈ దుఆ కూడా పఠించండి:-

"అల్లాహుమ్మ బిక అస్బహ్‌నా వ బిక అమ్ సయ్‌నా వ బిక నహ్‌యా వ బిక నమూతు వ ఇలైకన్నుషుర్."

అనువాదం:- ఓ దేవా! నీ సహాయం వల్లనే మాకు ప్రొద్దునయింది. నీ సహాయం మూలంగానే మాకు ప్రొద్దుగూకింది. నీ సమ్మతంతోనే మేము బ్రతికి ఉన్నాము. నీ సమ్మతితోనే మేము మరణిస్తాము. ఇంకా, నీ దగ్గరకే (ప్రళయదినాన) లేచి పోవలసి ఉంది."

లేదా

6. ఉదయం, సాయంత్రం ఈ 'దుఆ' చేయాలి:

"లా యిలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీకలహు లహుల్ ముల్కు వ లహుల్‌హమ్దు యుహ్‌యీ వ యుమీతు వహువ హయ్యుల్లా యమూతు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్"

అనువాదం: అల్లాహ్ తప్ప ఆరాధనకు అర్హులు ఎవరూ లేరు. ఆయన ఏకేశ్వరుడు. ఆయనకు సహవర్తులుగా మరొకరెవరూ లేరు. యావత్తు రాజ్యం ఆయనదే. సకల స్తోత్రాలు ఆయన కొరకే ఉన్నాయి, ఆయనే బ్రతికిస్తాడు. ఆయనే ప్రాణం తీస్తాడు. ఆయన ఎలాంటి సజీవుడంటే ఆయనకు మరణం అంటూలేదు. ఆయనే ప్రతి దానిపై అధికారి.

వివరణ:- ఈ దుఆ చేయటం ఎంతో పుణ్యప్రదమయిందని హదీసులలో పేర్కొనబడింది. ప్రొద్దున్నే ఈ ప్రార్థన చేస్తే సాయింత్రం

5. ఈ దుఆ కూడా పఠించండి:-

"అల్లాహుమ్మ బిక అస్బహ్నా వ బిక అమ్ సయ్నా వ బిక నహ్యా వ బిక నమూతు వ ఇలైకన్నుషురు."

అనువాదం:- ఓ దేవా! నీ సహాయం వల్లనే మాకు ప్రొద్దునయింది. నీ సహాయం మూలంగానే మాకు ప్రొద్దుగూకింది. నీ సమ్మతంతోనే మేము బ్రతికి ఉన్నాము. నీ సమ్మతితోనే మేము మరణిస్తాము. ఇంకా, నీ దగ్గరకే (ప్రళయదినాన) లేచి పోవలసి ఉంది."

లేదా

6. ఉదయం, సాయంత్రం ఈ 'దుఆ' చేయాలి:

"లా యిలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీకలహు లహుల్ ముల్కు వ లహుల్‌హమ్దు యుహ్‌యీ వ యుమీతు వహువ హయ్యుల్లా యమూతు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్"

అనువాదం: అల్లాహ్ తప్ప ఆరాధనకు అర్హులు ఎవరూ లేరు. ఆయన ఏకేశ్వరుడు. ఆయనకు సహవర్తులుగా మరొకరెవరూ లేరు. యావత్తు రాజ్యం ఆయనదే. సకల స్తోత్రాలు ఆయన కొరకే ఉన్నాయి, ఆయనే బ్రతికిస్తాడు. ఆయనే ప్రాణం తీస్తాడు. ఆయన ఎలాంటి సజీవుడంటే ఆయనకు మరణం అంటూలేదు. ఆయనే ప్రతి దానిపై అధికారి.

వివరణ:- ఈ దుఆ చేయటం ఎంతో పుణ్యప్రదమయిందని హదీసులలో పేర్కొనబడింది. ప్రొద్దున్నే ఈ ప్రార్థన చేస్తే సాయింత్రం

వరకు షైతాన్ చేష్టలకు దూరంగా ఉండవచ్చు అలాగే సాయంత్రం ఈ ఈ దుఆ చేస్తే (మరునాడు) ఉదయం వరకు షైతాన్ బారినుండి రక్షణ పొందవచ్చు.

7. ఉదయం, సాయంత్రం మూడేసి సార్లు ఈ "దుఆ" పఠించాలి:—

"రజీనా బిల్లాహి రబ్బంవ్వబిల్ ఇస్లామి దీనంవ్వ బి ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లమ నబియ్యన్"

అనువాదం:- మేము అల్లాహ్‌ను మా ప్రభువుగాను, ఇస్లాంను మా ధర్మంగానూ, ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లంను మా ప్రవక్తగానూ స్వీకరించాము. ఇది మాకు సమ్మతమే.

వివరణ:- ఒక హదీసులో ఉంది:- ఎవరయితే ఈ "దుఆ"ను ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం మూడేసి సార్లు చదువుతారో ఆ వ్యక్తిని ప్రళయదినాన సంతోషపెట్టటం- ఆ వ్యక్తిపై- అల్లాహ్ హక్కు అయిపోతుంది.

లేదా

8. మూడు సార్లు ఈ దుఆ చేయండి :

"రజీతు బిల్లాహి రబ్బంవ్వ బిల్ ఇస్లామి దీనంవ్వ బి ముహమ్మదిన్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) నబియ్యన్"

అనువాదం:- "నేను అల్లాహ్‌ను ప్రభువుగా, ఇస్లాంను ధర్మంగా, ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ను ప్రవక్తగా స్వీకరించాను. ఇది నాకు అంగీకారమే."

9. ఉదయం పూట ఈ దుఆ కూడా పఠించాలి. కొన్ని హదీసు ద్వారా ఉదయం పూట, సాయంత్రం పూట ఈ 'దుఆ' చేయాలని నిర్ధారిత మవుతోంది.

"యా హయ్యు యా ఖయ్యూమ్. బి రహ్మతిక అస్తగీసు అస్లిహ్ లీషానీ కుల్లహు వలా తకిల్నీ ఇలా నఫ్సీ తర్ఫత అయ్‌నిన్"

అనువాదం:- ఓ (ఎల్లప్పుడూ) సజీవంగా ఉండేవాడా! ఓ (భూమా కాశాలు మరియు సర్వ సృష్టికి) మూలాధారకుడా! నీ కారుణ్యాన్ని యాచిస్తున్నాను. నీవు నా పనులన్నింటినీ సవ్యంగా చేయి. ఇంకా, ఒక్క క్షణం కోసం కూడా నన్ను నా మనోవాంఛలకు అప్పగించకు."

వివరణ:- కష్ట సమయాలలో, 'సజ్దా'లో ఉన్న స్థితిలో ఈ 'దుఆ' చేయటం ప్రయోజనకరము. కారుణ్యమూర్తి ముహమ్మద్ (సఅసం) "బద్ర్" యుద్ధ సమయాన 'సజ్దా'లోకి వెళ్ళి ఈ 'దుఆ'నే పఠించారు. ఆఖరికి అల్లాహ్ ఆయనకు విజయం చేకూర్చాడు.

10. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం 7 సార్లు ఈ 'దుఆ' చేస్తే మంచిది:

"హస్బి యల్లాహ్. లా ఇలాహ ఇల్లా హువ, అలైహి తవక్కల్తు వహువ రబ్బుల్ అర్షిల్ అజీమ్."

అనువాదం:- "నా కోసం అల్లాహ్ చాలు. ఆయన తప్ప ఆరాధనకు ఎవరూ అర్హులు కారు. ఆయన్నే నేను నమ్ముకున్నాను. ఆయనే దైవ సింహాసనానికి యజమాని."

వివరణ:- హదీసులో వచ్చింది—

ఎవరయితే ఉదయం సాయింత్రం ఏడేసి సార్లు ఈ ప్రార్థన చేస్తారో వారిని అల్లాహ్ ప్రపంచంలోనూ, పరంలోనూ అన్ని రకాల దుఃఖాలనుండి కాపాడతాడు.

11. ప్రతి రోజూ ఉదయం, సాయింత్రం "కలిమయె షహాదత్"ను తప్పక పఠించాలి:-

"లా యిలాహ ఇల్లల్లాహు వహ్దహు లా షరీకలహు లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్"

అనువాదం:- అల్లాహ్ మినహా వేరెవరూ ఆరాధనకు తగిన వారు కాదు ఆయన ఒక్కడే. ఆయనకు సహవర్తులు ఎవరూ లేరు. యావత్తు రాజ్యం ఆయనదే. సకల స్తోత్రాలు ఆయన కొరకే ఉన్నాయి. ఆయనే ప్రతి దానిపై అధికారి.

వివరణ:- కొన్ని హదీసులలో వందేసి సార్లు చదవాలని వచ్చింది. తీరికలేక పోతే కనీసం 10 సార్లయినా ఈ 'దుఆ' చేయాలి. దీని వల్ల చాలా పుణ్యం ప్రాప్తం అవుతుంది.

12. ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం కనీసం 100 సార్లు ఈ "తస్బీహ్" (స్మరణ) చేయాలి.

"సుబ్ హానల్లాహిల్ అజీమి వ బిహమ్దిహి"

అనువాదం.- ఘనత కలవాడైన అల్లాహ్ పవిత్రుడు. స్తోత్రం, పొగడ్త ఆయన కోసమే ఉన్నాయి.

సహీహ్ బుఖారిలోని ఒక హదీసులో ఇలా ఉంది - "రెండు కలిమాలు (సద్వచనాలు) ఉన్నాయి. అవి కరుణామయుడికి ఎంతో ప్రతికరమయినవి. నాలుకపై (నోటికి) అవి చాలా సులువైనవే కాని (కర్మ పత్రాల) త్రాసులో చాలా బరువైనవి.

i) "సుబ్‌హానల్లాహి వ బిహమ్దిహి"

ii ) సుబ్‌హానల్లాహిల్ అజీమ్" అనేవే ఆ రెండు కలిమాలు.

కాబట్టి ఈ రెండు కలిమాలను ఉదయం, సాయంత్రం వీలయినంత అధికంగా పఠించాలి.

లేదా

పది సార్లు దరూదె షరీఫ్ చదివి, వంద సార్లు 'సుబ్‌హానల్లాహ్' వందసార్లు 'అల్‌హమ్దులిల్లాహ్', వందసార్లు 'లా యిలాహ ఇల్లల్లాహ్' వంద సార్లు 'అల్లాహు అక్బర్' ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం స్మరించాలి.

# రుణ భారం, విచారం దూరమయ్యేందుకు

1. ఒకవేళ ఏదైనా అప్పు (రుణం), లేక ఏదైనా ప్రాపంచిక దుఃఖం, కష్టాలలో చిక్కుకుని ఉందే ఉదయం, సాయంత్రం ఈ ప్రార్థన చేస్తూ ఉండాలి;

"అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ హమ్మి వల్ హుజ్ని వ అవూజుబిక మినల్ అజ్జి వల్ కస్లి వ అవూజుబిక మినల్ జుబ్ని వల్ బుఖ్లి వ అవూజుబిక మిన్ గలబతిద్దైని వ ఖహ్రిర్రిజాలి"

అనువాదం:- ఓ దేవా! నేను నీ శరణు పొందుతున్నాను-ప్రతి విచారం, దుఃఖం నుండి!

నీ శరణమే పొందుతున్నాను - దైన్యం మరియు సోమరితనం నుండి !!

(నేను) నీ శరణమే వేడుతున్నాను - పిరికితనం, పిసినారితనం నుండి!!!

ఇంకా, నీ శరణమే జొచ్చుతున్నాను-రుణభారం నుండి, ప్రజల దౌర్జన్యం నుండి!!!!

(వీటన్నింటి నుండి దేవా! నీవునన్ను కాపాడు!)

గమనిక :- ఇంతవరకు ఇక్కడ పేర్కొనబడిన 'దుఆ'లను ఉదయం, సాయంత్రం-రెండు పూటాలా పఠించవచ్చు, అయితే ఓ చిన్న విషయం గమనించాలి. ఏ 'దుఆ'లో నయితే "అస్‌బహ్‌తు" (నేను ఉదయం గడిపాను) లేక "అస్బహ్‌నా" (మేము ఉదయం గడిపాము) అని వచ్చిందో, ఆ దుఆను సాయంత్రం పూట చేసేటప్పుడు "అమ్‌సయ్‌తు" (నేను సాయంత్రం గడిపాను) లేక "అమ్‌సయ్‌నా" (మేము సాయంత్రం గడిపాము) అని పఠించాలి. ఏ దుఆలో నయితే "హాజల్ యౌమ్" (ఈ దినం) అనివచ్చిందో ఆ దుఆ ను రాత్రి పూట పఠించేటప్పుడు "హాజిహిల్లైలత" (ఈ రాత్రి) అని పలకాలి. ఏ దుఆలో నయితే "వ ఇలైహిన్నుషూర్" అని వచ్చిందో ఆ దుఆలో "వ ఇలైహిల్ మసీర్" అని మార్పు చేసుకోవాలి.

# ఇస్తె గ్ఫార్

ప్రతి రోజూ 25 లేక 27 సార్లు 'ఇస్తెగ్ఫార్ చేయాలి. అంటే, పాపాల మన్నింపు కోసం విశ్వప్రభుఽయిన అల్లాహ్‌ను వేడుకోవాలి.

"అల్లాహుమ్మగ్ఫిర్లీ వలిల్ మూమినీన వల్ మూమినాత్ వల్ ముస్లిమీన వల్ ముస్లిమాత్"

అనువాదం:- దేవా! నన్నూ మరియు విశ్వాసులయిన యావత్తు స్త్రీ పురుషుల అపరాధాలను, ముస్లిములయిన యావత్తు స్త్రీ పురుషుల అపరాధాలను మన్నించు.!"

వివరణ:- ఒక హదీసులో వివరించబడింది-

ఎవరయితే ప్రతిరోజూ 27 లేక 25 సార్లు విశ్వాసులయిన సకల స్త్రీ పురుషుల పాపాల క్షమాపణలకై వేడుకుంటాడో అతను దైవ సన్నిధిలో గౌరవప్రదమయిన స్థానం పొందుతాడు. అతను "ముస్తజాబె దావాత్" (ఎవరి ప్రార్థనలయితే దైవ సమక్షంలో ప్రశంసార్హమయినాయో) ప్రజలలో చేర్చబడతాడు. వారి "ప్రార్థన"ల ద్వారా భూవాసులకు ఆహారం యివ్వబడుతుంది.

# రాత్రిపూట ధ్యానం-దుఆలు

బఖరా సూరాయందలి ఈ చివరి రెండు ఆయత్‌లను రాత్రి పూట ఎప్పుడయినా పఠిస్తూ ఉండాలి-

"ఆమనర్రసూలు బిమా ఉన్‌జిల ఇలైహి మిర్రబ్బిహీ వల్ మూమినూన్. కుల్లున్ ఆమన బిల్లాహి వ మలాయికతిహీ వ కుతుబిహీ వ రుసులిహీ లా నుఫర్రిఖు బైన అహదిమ్మిర్రసులిహీ. వ ఖాలూ సమీన వ అత్ అన, గుఫ్‌రానక రబ్బనా వ ఇలైకల్ మసీర్.

"లా యు కల్లిఫుల్లాహు నఫ్సన్ ఇల్లా వుస్ అహా లహా మా కసబత్ వ అలైహ మక్‌తసబత్. రబ్బనా లా తుఆఖిజ్నా ఇన్నసీనా అవ్ అఖ్ తఆనా రబ్బనా వలా తహ్మిల్ అలైనా ఇస్‌రన్ కమాహమల్తహు అలల్లజీన మిన్ ఖబ్లినా రబ్బనా వలా తుహమ్మిల్నా మాలా తాఖతలనా బిహి. వఅ్‌ఫు అన్నా వ అగ్ఫిర్లనా వర్‌హమ్నా అన్త మౌలానా ఫన్‌సుర్నా అలల్ ఖౌమిల్ కాఫిరీన్"

అనువాదం:- ప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) తనపై తన ప్రభువు తరపు నుండి అవతరించిన దాన్ని విశ్వసించారు. ఈ ప్రవక్తను విశ్వసించేవారు కూడా దాన్ని హృదయపూర్వకంగా స్వీకరించారు. వీరంతా అల్లాహ్‌ను, ఆయన దూతలను, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తలను

విశ్వసిస్తారు. వీరు అంటారు, "మేము అల్లాహ్ ప్రవక్తల్లోని ఏ ఒక్కరినీ విచక్షణా భావంతో చూడము. మేము ఆదేశం విన్నాము మరియు శిరసావహించాము. స్వామీ! క్షమా భిక్ష పెట్టమని మేము నిన్ను అర్థిస్తున్నాము. చివరకు మేమంతా నీ వైపుకే మరలివస్తాము."

ఏ ప్రాణిపైనా అల్లాహ్ దాని శక్తి సామర్థ్యాలకు మించిన బరువు బాధ్యతలను మోపడు. తాను సంపాదించిన పుణ్యానికి సత్ఫలితం, తాను కూడబెట్టిన పాపానికి దుష్ఫలితం ప్రతి వ్యక్తి అనుభవిస్తాడు. (విశ్వసించిన ప్రజలారా! మీరు ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండండి) "మా ప్రభూ! పొరపాటు వల్ల జరిగే మా తప్పుల్ని పట్టబోకు. స్వామీ! మాకు పూర్వం వారిపై మోపిన భారాన్ని మాపై మోపకు. ప్రభూ! ఏ బరువునైతే మోసే శక్తి మాలో లేదో, దాన్ని మాపై పెట్టకు. మమ్మల్ని మన్నించు; మమ్మల్ని క్షమించు; మమ్మల్ని కరుణించు. నీవు మాకు రక్షకుడవు. కాఫిర్లకు వ్యతిరేకంగా మాకు సహాయపడు."

వివరణ:- హదీసులో ఉంది:- ఎవరయితే రాత్రి పూట బఖరా సూరాలోని ఈ చివరి రెండు ఆయత్‌లను పఠిస్తారో వారికి అల్లాహ్ ప్రతి చెడు నుండి భద్రంగా ఉంచుతాడు.

# రేయింబవళ్ళ 'దుఆ'లు
# -సయ్యిదుల్ ఇస్తెగ్ఫార్

"అల్లాహుమ్మ అన్త రబ్బి లా యిలాహ ఇల్లా అన్త ఖలఖ్ తనీ వ అనా అబ్దున్ వ అనా అలా అహ్దిక వ వాదిక మస్తతఅతు అవూజుబిక మిన్షర్రి మా సనతు అబూవులక బి నీమతిక అలయ్యా వ అబూ ఉబి జన్బీ ఫగ్ఫిర్లీ ఫ ఇన్నహు లా యగ్ఫిరుజ్జునూబ ఇల్లా అన్త."

అనువాదం:- "దేవా! నీవు నా ప్రభువువి. నీవు తప్ప ఆరాధనకు అర్హులు మరెవరూ లేరు. నువ్వే నన్ను సృష్టించావు. నేను నీ దాసుణ్ణే. నేను నీ ప్రమాణంపై, నీ వాగ్దానంపై నాకు సాధ్యమయినంతవరకు స్థిరంగా ఉన్నాను నా ద్వారా జరిగిన దుశ్చేష్టల నుండి నేనీ శరణు వేడుకుంటున్నాను. నాపై ఉన్న నీ దయానుగ్రహాలను నీ ఎదుట ఒప్పుకుంటున్నాను. ఇంకా, నా అపరాధాలను కూడా (నీ ఎదుట) ఒప్పుకుంటున్నాను. కనుక నీవు నా అపరాధాలను క్షమించు. ఎందుకంటే, నీవు తప్ప అపరాధాలను ఎవరూ మన్నించలేరు."

వివరణ:- హదీసులో ఇలా చెప్పబడింది:-

'ఎవరయినా ఈ 'ప్రార్థన'ను రాత్రిగాని, పగలుగాని, ఓసారి చిత్తశుద్ధితో, దృఢ విశ్వాసంతో పఠిస్తే, ఆ రాత్రిగాని, లేక పగలుగాని చనిపోతే అతను తప్పక స్వర్గ లోకి ప్రవేశిస్తాడు.'

2. అందుచేతనే హదీసు గ్రంథంలో ఈ 'దుఆ' 'సయ్యిదుల్ ఇస్తిగ్ఫార్' (సర్వోన్నత ఇస్తిగ్ఫార్) గా పేర్కొనబడింది.

ఎవరయితే పగలు గాని, రేయి గాని లేక నెలలో ఒకసారి క్రింద పేర్కొనబడిన 'దుఆ' పఠిస్తాడో, ఆ వ్యక్తి ఒకవేళ ఆ పగలో, లేక రాత్రో లేక ఆ నెలలో మరణిస్తే అతని పాపాలు తప్పకుండా క్షమించబడతాయి.

"లా యిలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్
లా యిలాహ ఇల్లల్లాహు వహ్‌దహు
లా యిలాహ ఇల్లల్లాహు లా షరీకలహు
లా యిలాహ ఇల్లల్లాహు లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు
లా యిలాహ ఇల్లల్లాహు వలా హౌల వలా ఖువ్వత ఇల్లాబిల్లాహి"

అనువాదం:- అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. మరియు ఆయనే అందరికంటే గొప్పవాడు. అల్లాహ్ తప్ప మరెవ్వరూ ఆరాధనకు తగినవారు కారు. ఆయన ఏకేశ్వరుడు. అల్లాహ్ తప్ప వేరెవరు ఆరాధనకు అర్హులు కారు. ఆయనకు సహవర్తులు ఎవరూలేరు. అల్లాహ్ తప్ప ఇంకొక ఆరాధ్య దైవం లేడు. ఆయనదే (యావత్) రాజ్యం. స్తోత్రాలు ఆయన కొరకే ఉన్నాయి అల్లాహ్ తప్ప వేరొక ఆరాధనీయుడు ఎవడూ లేడు. అల్లాహ్ (సహాయం) లేకుండా ఎలాంటి బలంగాని, శక్తిగాని లభించే దిక్కులేదు.

# ఇంట్లో ప్రవేశించేటప్పుడు, ఇంటినుండి బయటికి వెడలేటప్పుడు చేయవలసిన ప్రార్థన

1. ఇంట్లోకి ప్రవేశించవలసి ఉన్నా, బయటికి పోవలసి వున్నా క్రింద పొందుపరచబడిన "దుఆ"ను పఠించాలి.

ఇంకా ఇంటి వారికి "సలాం" * చేయాలి:

"అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుక ఖైరల్ మౌలజి వఖైరల్ మఖ్‌రజి బిస్మిల్లాహి వ లజ్‌నా వ బిస్మిల్లాహి ఖరజ్‌నా వ అలల్లాహి రబ్బినా తవక్కల్నా."

అనువాదం:- ఓ అల్లాహ్! నేను యింట్లోకి ప్రవేశించినా, ఇంటి నుండి బయటికి వెళ్ళినా దాని శ్రేయోవికాసాలను నీ నుండి అర్థిస్తున్నాను. మేము అల్లాహ్ పేరుతో పాటే ఇంట్లోకి వస్తాము, అల్లాహ్ పేరుతోనే ఇంటి నుండి బయటికి పోతాము. ఇంకా, మా ప్రభువైన అల్లాహ్ ఔన్నత్యం పైనే మాకు విశ్వాసం ఉంది."

---

* హదీసులో వచ్చింది.- "ఒక వ్యక్తి మహనీయ ముహమ్మద్ (సఅసం) సన్నిధిలోకి వచ్చి, తన దారిద్ర్య స్థితి గురించి షికాయతు చేశాడు, అప్పుడు మహాప్రవక్త (సఅసం) అతనికి హితబోధ చేశారు- "నీవు నీ ఇంటి లోపలికి ప్రవేశించినప్పుడల్లా 'సలాం' చేసి మరీ ప్రవేశించు

-ఇంట్లో ఎవరు ఉన్నా లేకపోయినా సరే! ఆ తరువాత నాపై దరూద్ మరియు సలాం పంపు. ఆపైన "ఖుల్ హువల్లాహ్ పఠిస్తూ ఉండు."

ఆ వ్యక్తి తదనుగుణంగా ఆచరించసాగాడు. అల్లాహ్ ఆ వ్యక్తికి ఎన్ని సిరిసంపదలు అనుగ్రహించాడంటే దాని ద్వారా ఆ వ్యక్తి (కేవలం తన భార్యా పిల్లలనే కాక) ఇరుగు పొరుగున ఉన్న వారిని కూడా ఆదుకునే వాడు. బంధుమిత్రుల బాగోగులను గురించి కూడా పట్టించుకునేవాడు. కాబట్టి ఇంట్లోకి ప్రవేశించేటప్పుడు, ఇంటినుండి బయటికి వెడలేటప్పుడు "సలాం" చెయ్యటాన్ని మహత్ పూర్వకంగా హదీసులో చెప్పబడింది. దివ్య ఖురాన్‌లో కూడా ఈ ఆజ్ఞ ఉంది.

# రాత్రి పూట పాటించవలసిన నియమాలు

రాత్రి పూట చిన్న పిల్లలను ఇంటి బయటికి పంపకూడదు. ఎందుకంటే, షైతాన్‌లు ఆ సమయాన విచ్చలవిడిగా విహరిస్తూ ఉంటారు. రెండొంతుల రాత్రి గడిచిపోయిన తరువాత పిల్లలను వదిలితే ఫరవాలేదు. నిద్రపోయే ముందు "బిస్మిల్లాహ్" అని చెప్పి ఇంటి తలుపులు మూయండి. "బిస్మిల్లాహ్" పఠించే దీపం ఆర్పండి. ఇంకా, 'బిస్మిల్లాహ్' ఉచ్చరించే మీ కంచాలపై ఏదైనా కప్పండి. కప్పటానికి ఏమీ లేకపోతే ఆఖరికి ఏదైనా కొయ్యలాంటిదైనా సరే కప్పండి. మీరు తినే పదార్థాలపై, లేక మీరు వాడే వస్తువులపై షైతాన్ తదితర క్షుద్ర శక్తులు ఆవహించకుండా ఉండటానికి ఇలా చేయటం ఎంతో అవసరం.

నిద్రించేముందు 'ఉజూ' చేసి పడకపై వాలాలని హదీసులో చెప్పబడింది 'ఉజూ' గనక లేకపోతే వుజూ చేసి వచ్చి మరీ నిద్రపోవాలి.

నిద్రపోయేముందు ఈ 'దుఆ' చేయాలి:

"అల్లాహుమ్మ ఖినీ అజాబక యౌమ తబ్‌అసు ఇబాదక"

అనువాదం:- ఓ దేవా! ఏ రోజునయితే నువ్వు నీ దాసులను (సమాధుల నుండి) లేపుతావో ఆ రోజు నన్ను నీ ఆగ్రహం నుండి కాపాడు.

ఈ "దుఆ" కూడా పఠించాలి:

"అల్లాహుమ్మ బిస్మిక అమూతు వ అహ్యా"

అనువాదం:- ఓ అల్లాహ్! నేను నీ పేరు మీదనే మరణిస్తాను (మరియు నీ పేరు మీదనే) జీవిస్తున్నాను."

నిద్రపోయే ముందు రెండు చేతులూ కలుపుకోండి - తరువాత "ఖుల్‌హు వల్లాహు అహద్" "ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్," "ఖుల్ అవూజు బిరబ్బిన్నాస్" సూరాలు పఠించి రెండు చేతులనూ శరీరంపై తడమండి (త్రిప్పుకోండి). ముందుగా తల, ఆ తరువాత ముఖం, శరీరపు భాగం తడుముతూ పోవాలి. ఈ విధంగా మూడు సార్లు చేయాలి.

పడకపై పడుకొని * "ఆయతుల్ కుర్సీ" చదవండి.

## పాపాల మన్నింపుకోసం మూడుమార్లు వేడుకోవాలి:

"అస్తగ్ఫిరుల్లాహల్లజీ లా యిలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూము వ అతూబు ఇలైహి."

అనువాదం:- నేను ఆ దైవాన్ని పాపాల క్షమాభిక్షకోసం అర్థిస్తు

---

* ఒక హదీసు ఉంది—

"ఏ వ్యక్తయితే నిద్రపోయే ముందు మంచంపై వాలి 'ఆయతుల్ కుర్సీ' పఠిస్తాడో, అల్లాహ్ అతని ఇల్లును, అతని ఇరుగు పొరుగున ఉన్నవారి ఇళ్ళను (ఆ రాత్రికి) తన సంరక్షణలోకి తీసుకుంటాడు. తెల్లవారయ్యే దాకా షైతాన్ ఆ వ్యక్తి జోలికి కూడా రాదు.

న్నాను- ఎవరి ఆలనా పాలనలోనయితే ఇంకొకరికి వాటా లేదో; ఆయన (ప్రతినిత్యం) సజీవంగా ఉండేవాడు, మూలాధారకుడు. ఇంకా, నేను ఆయన వైపుకే (పశ్చాత్తాపంతో) మళ్ళవలసి ఉంది.

లేక

ఈ "దుఆ" చేయాలి:-

"లా యిలాహ ఇల్లల్లాహు వహ్దహు లా షరీకలహు లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్. లా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహి. సుబ్హానల్లాహి వల్ హమ్దు లిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్."

అనువాదం: అల్లాహ్ తప్ప మరొకరెవరూ పూజించదగిన వారు కారు. ఆయన ఒక్కడే. ఆయనకు సహవర్తులు ఎవరూలేరు. రాజ్యం ఆయనదే. సకల స్తోత్రాలు, పొగడ్తలు ఆయన కొరకే (ఉన్నాయి). అల్లాహ్ (అన్ని రకాల చెడులు, లోపాల నుండి) పరిశుద్ధుడు. ఇంకా, (కేవలం) అల్లాహ్ కొరకే పొగడ్తలు, ప్రశంసలు ఉన్నాయి. అల్లాహ్ మినహా మరో దైవం లేనేలేడు. మరియు అల్లాహ్ అందరికంటే గొప్పవాడు.

బఖరా సూరాలోని చివరి మూడు ఆయత్‌లు-అంటే, 'లిల్లాహి మా ఫిస్సమావాతి' నుండి చివరిదాకా చదివే వరకూ నిద్రపోకండి.

హజ్రత్ అలి (రజి అల్లాహు అన్హు) ఇలా అభిప్రాయ పడ్డారు:

"ఏ బుద్ధిమంతుడూ బఖరా సూరాలోని చివరి మూడు ఆయత్‌లు చదువకుండా నిద్రపోతాడని నేను అనుకోను."

### నిద్రలో భయపడినా, కలత చెందినా. నిద్రా భంగం జరిగినా చేయవలసిన "దుఆ":-

"అఊజు బి కలిమాతిల్లాహిత్తామ్మాతి మిన్ గజబిహీ వ ఇఖాబిహీ వ షర్రి ఇబాదిహీ వమిన్ హమజాతిష్ష యాతీని వ అంయ్యహ్జురూన్"

అనువాదం:- నేను అల్లాహ్ యొక్క 'కలిమాతె తామ్మా' (సంపూర్ణ మయిన సద్వచనాల) శరణు పొందుతున్నాను-ఆయన ఆగ్రహం నుండీ, కోపం నుండీ, ఆయన శిక్ష నుండీ, ఆయన దాసుల యొక్క దుశ్చర్యల నుండీ, షైతాన్ దుస్స్పహ: నుండీ, చివరికి షైతాన్ నా సమీపానికి రావటం నుండి సయితం అల్లాహ్ శరణు కోరుతున్నాను.

వివరణ:- హదీసులో వచ్చింది—

హజ్రత్ అబ్దుల్లాబిన్ ఉమ్రబిన్ ఇలియాస్ (ర.అ) ఈ 'దుఆ'ను మానసిక స్ప్రుహ వచ్చిన పిల్లలందరి చేత ఒక్కొక్క పదం కంఠస్థం చేయించే వారు. చిన్న పిల్లల కోసం ఈ ఆయత్ చదివి తాయెత్తు కట్టి వారి మెడలో వేసేవారు.

## నిద్రనుంచి లేచేముందు చేయవలసిన ప్రార్థన

అల్ హమ్దు లిల్లాహిల్లజీ అహ్యాన బాద మా అమాతనా వ ఇలైహిన్నుషూర్"

అనువాదం :- "ఎవరయితే మనల్ని నిర్జీవం చేసిన తరువాత

మళ్ళీ తిరిగి సజీవం చేశాడో ఆ దైవానికి (ఎన్నో) కృతజ్ఞతలు. ఇంకా, ఆయన వైపుకే వెళ్ళవలసి ఉంది".

## మేల్కొన్న తరువాత చేయవలసిన ప్రార్థన :

"లా యిలాహ ఇల్లల్లాహు వహ్దహు, లా షరీకలహు లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్. అల్‌హమ్దులిల్లాహి వ సుబ్‌హానల్లాహి వలా యిలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్ వలా హౌల వలాఖువ్వత ఇల్లా బిల్లాహి".

అనువాదం :- అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవంలేదు. ఆయన ఏకేశ్వరుడు. ఆయనకు సహవర్తులు ఎవరూలేరు. ఆయనదే రాజ్యం. ఆయన కోసమే పొగడ్తలు ఉన్నాయి. ఆయనే అన్నింటిపై అధికారి. సకల స్తోత్రాలు ఆయన కొరకే (ఉన్నాయి). అల్లాహ్ (అన్ని చెడుల నుండి) పరిశుద్ధుడు. ఆయన తప్ప మరొక దేవుడు లేడు. అల్లాహ్‌యే అందరికన్నా గొప్పవాడు. అన్నిరకాల బలం, అండదండలు అల్లాహ్ తరపు నుంచే ఉన్నాయి

# ఉజూ సమయంలో....

1. 'ఉజూ చేయడానికి ఉపక్రమించగానే మొదట 'బిస్మిల్లాహ్' అనాలి. ఆ తరువాత ఈ 'దుఆ' పఠించాలి :-

అల్లాహుమ్మగ్ఫిర్లీ జన్‌బీ వ వస్సిలీ ఫీదారి వ బారిక్‌లీ ఫీ రిజ్‌ఖీ"

అనువాదం:- దేవా! నీవు నా పాపాలను మన్నించు. నా ఇంట్లో విశాలత చేకూర్చు. నా ఆహారంలో సమృద్ధిని ప్రసాదించు.

2. 'ఉజూ చేసిన తరువాత ఆకాశం వైపుకు దృష్టిని మరల్చి మూడు సార్లు ఇలా ప్రార్థించండి-

'అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహు లా షరీకలహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహు'

అనువాదం:- అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేదని నేను సాక్ష్యం ఇస్తున్నాను.ఆయన ఏకేశ్వరుడు. ఆయనకు భాగస్వామి లేరు. ఇంకా ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆయన దాసుడనీ, ప్రవక్త అనీ నేను సాక్ష్యమిస్తున్నాను.

ఆ తరువాత ఇలా ప్రార్థించండి:-

1. "అల్లాహుమ్మజ అల్నీ మిన త్తవ్వాబీన వజ్అల్నీ మినల్ ముత తహ్హిరీన్"

అనువాదం :- ఓ దేవా! నీవు నన్ను అధికంగా పశ్చాత్తాపపడే వారిలో చేర్చుకో. ఇంకా, నన్ను ఎక్కువ పవిత్రంగా, పరిశుద్ధంగా ఉండే వారిలో ప్రవేశం కల్పించు."

## తహజ్జుద్ నమాజ్ అనంతరం చేయవలసిన 'దుఆ'

సుబ్హా నల్లాహి రబ్బిల్ ఆలమీన్. సుబ్హానల్లాహి వ బిహమ్దిహి".

అనువాదం :-(అన్ని లోపాలు, దోషాల నుండి) పవిత్రమైనవాడు అల్లాహ్. సకల లోకాలకు ప్రభువు అల్లాహ్ పవిత్రతను చాటుతాను. ఆయన్నే స్తుతిస్తాను."

2. జాము రాత్రిన (తహజ్జుద్ నమాజ్ కోసం లేస్తే) ఆలి ఇమ్రాన్ సూరాలోని చివరి 10 ఆయత్లను తప్పక చదవాలి.

"ఇన్న ఫీ ఖలఖిస్సమావాతి వల్అర్జి వఖ్తిలాఫిల్లైలి వన్న హారి ల ఆయాతిల్ లి ఉలిల్ అల్బాబ్".

(190)

అనువాదం :- భూమి మరియు ఆకాశాల సృష్టిలో, రేయింబవళ్ళు ఒకదాని తరువాత ఒకటి రావటంలో తెలివిగల ప్రజలకు (అల్లాహ్ గొప్ప

తనం మరియు మహాత్మ్యం యొక్క అసంఖ్యాకమయిన) * సూచనలు ఉన్నాయి.

---

* ఈ హదీసుకు సంబంధించిన కొన్ని ఉల్లేఖనాలలో, ఆలి ఇమ్రాన్ సూరాలోని కేవలం 190 వ ఆయత్ పఠిస్తే సరిపోతుందని ఉంది. చివరి 10 ఆయత్‌లు మొత్తం పఠించవలసిందేనని మరికొన్ని ఉల్లేఖనాలలో ఉంది. చదవదలచిన వారికి 10 ఆయత్‌లు కూడా గుర్తుంటే, చదవటమే మంచిది. లేకపోతే కనీసం 190 వ ఆయత్ నయినా చదువుకోవాలి. మొత్తానికి ఇది చదవటం చాలా పుణ్యప్రదం.

# దుఆయే ఖునూత్

1. వితర్ నమాజ్‌లోని చివరి రకాత్‌లో ఈ 'దుఆ' పఠించాలి-

"అల్లాహుమ్మ ఇన్నా న స్తయీనుక వనస్తగ్ఫిరుక : నుస్ని అలైకల్ ఖైర్. వ నష్కురుక వలా నక్ఫురుక వ నఖ్లవు వ నత్రుకు మఁయఫ్జురుక అల్లాహుమ్మ ఇయ్యాక న అబుదు వలక నుసల్లి వనస్జుదు వ ఇలైక నస్ఆ వ నహ్ఫిదు వ నఖ్షా అజా బక వ నర్జూ రహ్మతక ఇన్న అజాబక బిల్‌కుఫ్ఫారి ముల్‌హిఖ్."

అనువాదం:- ఓ దేవా! నిస్సందేహంగా మేము నిన్నే సహాయం కొరకు అర్థిస్తున్నాము. నిన్నే పాపాల క్షమాపణకోసం వేడుకుంటు న్నాము. నీ ఉత్తమ శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము నీకు కృతజ్ఞతలు తెలుపు తున్నాము. నీకు కృతఘ్నులము కాము. ఎవరయితే నీ యెడల కృత ఘ్నులవుతారో వారితో సంబంధము పెట్టుకోము. వారిని వదలి వేస్తాము. ఓ అల్లాహ్!! మేము నిన్నే ఆరాధిస్తున్నాము. నీ కొరకే నమాజ్ చేస్తు న్నాము. (కేవలం) నీకే 'సజ్దా' చేస్తున్నాము. నీ వైపుకే పరుగెడు తున్నాము. ఇంకా, నీ వైపుకే ఆరాటపడుతున్నాము. నీ ఆగ్రహానికి భయ పడుతున్నాము నీ కారుణ్యంపై ఆశపెట్టుకున్నాము. నిస్సందేహంగా నీ ఆగ్రహం తిరస్కారులపై విరుచుకు పడుతుంది.

# వితర్ నవమాజ్ అనంతరం

వితర్ నమాజ్ పూర్తయిన (సలాం చేసిన) వెంటనే ఈ కలిమాను 3 సార్లు పఠించాలి—

"సుబ్‌హానల్ మలికిల్ ఖుద్దూస్
సుబ్‌హానల్ మలికిల్ ఖుద్దూస్
సుబ్‌హానల్ మలికిల్ ఖుదూస్ - రబ్బుల్ మలాయికతి
వర్రూహ్"

అనువాదం :- "పవిత్రమయిన రాజు - ఎంతో పరిశుద్ధుడు !
(అన్నింటికీ) అతీతుడయిన చక్రవర్తి - ఎంతో పవిత్రుడు !!
స్వచ్ఛమయిన పాదుషా - ఎంతో పరిశుభ్రత కలవాడు !!!
దూతలకు ఆత్మలకు ప్రభువు."

# మస్జిద్‌లో ప్రవేశించినపుడు

మస్జిద్‌లో ప్రవేశించినపుడు ఇలా ప్రార్థించాలి-

"అల్లాహుమ్మఫ్ తహ్‌లీ అబ్వాబ రహ్మతిక"

అనువాదం :- ఓ అల్లాహ్ ! నీవు, నా కోసం నీ కారుణ్య ద్వారాలను తెరిచేయి.

# మస్జిద్ నుండి బయటికి వెళ్ళేటప్పుడు

"అల్లాహుమ్మ ఇన్నీ అస్ అలుక మిన్ ఫజ్లిక"

అనువాదం :- ఓ అల్లాహ్ ! నేను నిన్ను నీ అనుగ్రహం కొరకు వేడుకుంటున్నాను.

# అజాన్ ఇచ్చిన వేళ....

1. అజాన్ పిలుపు పూర్తయిన వెంటనే దరూదే షరీఫ్ చదివి, మరుక్షణమే ఈ క్రింది 'దుఆ' కూడా పఠించాలి.

"అల్లాహుమ్మ రబ్బ హాజిహిద్దావ తిత్తామ్మతి వస్సలాతిల్ ఖాయిమతి ఆతి ముహమ్మద నిల్ వసీలత వల్ ఫజీలత వబ్అస్హు మఖామమ్ మహ్మూద నిల్లజీ వ అత్తహు ఇన్నక లా తుఖ్లిఫుల్ మీ ఆద్"

అనువాదం:- ఓ దేవా!

ఓ సంపూర్ణ ప్రార్థనకు యజమానీ!!

స్థాపించబడే నమాజ్ కు యజమానీ!!!

నీవు ముహమ్మద్ (సఅసం) కు అత్యున్నత స్థానం ప్రసాదించు. ఏ 'ముఖామె మహ్మూద్' (ప్రశంసా ప్రదమయిన స్థానం) గురించి నీవు ఆయన (సఅసం) కు వాగ్దానం చేశావో ఆ స్థానంపై ఆయన్ని ప్రతిష్ఠింపజెయ్యి. నిస్సందేహంగా నువ్వు వాగ్దానభంగం చేసేవాడవుకావు.

# నమాజ్ లో దుఆలు

1. నమాజ్ చేయడానికి నిలబడగానే ముందు ఈ 'దుఆ' పఠించాలి:

"ఇన్నీ వజ్జహ్తు వజ్హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్జ హనీఫమ్మ్రస్లిమంవ్వమా అనా మినల్ ముష్రికీన్. ఇన్న సలాతి వ నుసుకి వమహ్యాయ వ మమాతీ లిల్లాహి రబ్బిల్ ఆలమీన్!!

అనువాదం:- ఎవరయితే ఆకాశాలను, భూమిని సృష్టించాడో ఆయన (ఆ ప్రభువు) వైపుకు నేను నా ముఖాన్ని త్రిప్పుకున్నాను. (అన్ని వైపులనుండి) ముఖం త్రిప్పేసుకుని (కేవలం ఆయనకే) దాసుడనై (నిలబడ్డాను). బహుదైవో పాసకులతో నాకు ఎలాంటి సంబంధం లేదు. నిస్సందేహంగా నా నమాజ్, నా ఖుర్బానీ (త్యాగం), నా జీవితం, నా మరణం (అన్నీ) సర్వలోకాలకు ప్రభువయిన అల్లాహ్ కొరకే.

## తక్బీర్ తరువాత:-

1 తక్బీర్ తరువాత, అంటే, "అల్లాహు అక్బర్" అని చెప్పి చేతులు కట్టుకున్నాక ఈ 'దుఆ' చేయాలి.

"సుబ్హాన కల్లాహుమ్మ వ బిహమ్దిక వ తబారకస్ముక వ తఆ లాజద్దుక వలా ఇలాహ గైరుక్"

అనువాదం:- ఓ దేవా! నీ స్తోత్రంతో పాటు నేను నీ పవిత్రతను

...సు. నీ నామం ఎంతో వికాసవంతమైంది, నీ గొప్ప
...స్తృతమయింది. ఇంకా, నీవు తప్ప మరెవరూ ఆరాధనకు
...తగరు.

## రుకూలో...

రుకూలోకి వెళ్ళినపుడు కనీసం మూడుసార్లు ఈ 'దఆ' పఠించాలి:

"సుబ్‌హాన రబ్బియల్ అజీమ్"

(ఘనత కలవాడైన నా ప్రభువు పరిశుద్ధుడు)

## 'రుకూ' నుండి నిలబడేటప్పుడు...

రుకూ నుండి నిలబడేటప్పుడు ఇలా పలకాలి.

"సమి అల్లాహు లిమన్ హమిదహ్"

అనువాదం :- అల్లాహ్ ఆ వ్యక్తిది విన్నాడు (మరియు సమ్మతించాడు) - ఏ వ్యక్తయితే తన గురించి ప్రశంసించాడో!

## ఆ తరువాత...

'రబ్బనా వలకల్ హమ్దు హమ్దన్ కసీరన్ తయ్యిబమ్ ముబారకన్ ఫీహి'

అనువాదం:- ఓ ప్రభూ! (నేను నిన్నే ప్రశంసిస్తున్నాను) అత్యధికమయిన, పవిత్రమయిన, అభ్యుదయకరమయిన స్తోత్రాలు నీ కొరకే ఉన్నాయి.

## రెండు 'సజ్దా' ల మధ్య...

నమాజ్‌లో ఒక 'సజ్దా' చేసి కూర్చుని, రెండోసారి 'సజ్దా' లోకి వెళ్ళకముందు ఈ 'దుఆ' చేయాలి.

అల్లాహుమ్మగ్ఫిర్లీ వర్‌హమ్నీ వ అఫీని వహ్‌దినీ వర్‌జుఖ్నీ వజ్‌బుర్నీ వర్‌ఫాని"

అనువాదం :- ఓ అల్లాహ్ ! నీవు నన్ను క్షమించు. నాపై కరుణించు. నాకు ఆరోగ్యాన్ని ప్రసాదించు. సద్బుద్ధిని ఇవ్వు. నాకు ఆహారం ప్రసాదించు. నా దురదృష్టాన్ని అదృష్టంగా మార్చు. ఇంకా, నాకు ఔన్నత్యం ప్రసాదించు.

## అత్తహియ్యాత్

"అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వ రహ్మతుల్లాహి వబరకాతుహు అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహిస్సాలిహీన్ అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహు."

అనువాదం :- సకల నోటి ఆరాధనలు, సకల క్రియాత్మక ఆరాధనలు మరియు సకల ధనపరమయిన ఆరాధనలు అల్లాహ్ కొరకే. (ఓ ప్రవక్తా !) మీపై శాంతి కలుగుగాక ! ఇంకా, అల్లాహ్ కరుణానుగ్రహాలు కూడా (కలుగుగాక !). ఇంకా మాపై, సజ్జనులయిన అల్లాహ్ దాసులపై శాంతి శాంతి కలుగుగాక ! అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య

దైవం లేడని, మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) దేవుని దాసులని, సందేశహరులని నేను సాక్ష్యం ఇస్తున్నాను.

## దరూద్

"ఖాయిదా"లో అత్తహియ్యాత్ తరువాత ఈ క్రింద పేర్కొన బడిన 'దరూద్' పఠించాలి.

"అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మదిఁవ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిఁవ్వ అలా ఆలి ముహమ్మదిన్ కమా బారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదుమ్మజీద్".

అనువాదం :- ఓ అల్లాహ్ : నీవు ముహమ్మద్ (సఅసం)పై, ముహమ్మద్ (సఅసం) సంతానంపై కారుణ్యాన్ని అవతరింపజెయ్యి— ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీం (అస్సలాం) మరియు ఆయన సంతానంపై కారుణ్యాన్ని కురిపించావో. నిస్సందేహంగా నీవే ప్రశంసార్హుడవు, గొప్పదనానికి యజమానివి. ఓ దేవా : : ముహమ్మద్ (సఅసం) మరియు ముహమ్మద్ (సఅసం) సంతానంపై వృద్ధీ వికాసాలను అవతరింపజేయి - ఏ విధంగానయితే నువ్వు ఇబ్రాహీం అలైహిస్సలాంపై, ఆయన సంతానంపై వృద్ధీవికాసాలను అవతరింపజేశావో. నిస్సంశయంగా నువ్వే పొగడ్తలకు అర్హుడవు. నువ్వే గొప్పదనానికి యజమానివి.

## దరూదె షరీఫ్ తరువాత...

ధరూదె షరీఫ్ చదవటం పూర్తయిన మీదట మీ మనసు కోరిన

'దుఆ'ను మెల్లగా (లోలోన) చదువుకోవచ్చు. అయితే దుఆయే మాసూరా చదవటం ఉత్తమం. లేక ఖుర్ఆన్‌లో ఉన్న దుఆలలో ఏదయినా చదువుకోవచ్చు. ఆ తరువాత క్రింద పొందుపరచబడిన "త అవ్వుజ్"ను పఠించాలి :-

"అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మిన్ అజాబి జహన్నమ వమిన్ అజాబిల్ ఖబ్రి వమిన్ ఫిత్నతిల్ మహ్యా వల్‌మమాతి వమిన్‌షర్రి ఫిత్నతిల్ మసీహిద్దజ్జాల్".

అనువాదం :- ఓ దేవా ! నరకయాతన నుండి, సమాధియాతన నుండి, జీవన్మరణాల ఉపద్రవాల నుండి, కానాదజ్జాల్ ఉపద్రవం నుండి నేను నీ శరణు పొందుతున్నాను (వీటన్నిటి నుండీ నువ్వు నన్ను కాపాడు).

లేక

ఈ 'దుఆ' పఠించాలి :

"అల్లాహుమ్మ ఇన్నీ జలమ్‌తు నఫ్సీ జుల్మన్ కసీరవ్వలా యగ్ఫిరుజ్జునూబి ఇల్లా అన్త ఫగ్ఫిర్లీ మగ్ఫిరతమ్మిన్ ఇన్దిక వర్‌హమ్నీ ఇన్నక అన్తల్ గఫూరుర్రహీమ్".

అనువాదం :- ఓ దేవా ! నిస్సందేహంగా నేను నా ప్రాణంపై ఎంతో జులుం (అపరాధం) చేశాను. ఇంకా, నువ్వు తప్ప మరెవరూ అపరాధాన్ని మన్నించలేరు. కనుక నువ్వు నీ ప్రత్యేక క్షమాగుణంతో నా (సమస్త) అపరాధాలను క్షమించు. నాపై కరుణించు. నిస్సందేహంగా నువ్వే అత్యధికంగా క్షమించేవాడవు, కరుణించేవాడవు.

## సలాం చేసినతరువాత...

నమాజ్‌లో సలాం చేసిన వెంటనే క్రింద పేర్కొనబడిన "కలిమయె తౌహీద్" పఠించండి

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీకలహూ లహుల్ ముల్కు వ లహుల్‌హమ్దు యుహ్యీ వ యుమీతు బియదిహిల్ ఖైరు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్. అల్లాహుమ్మ లా మానిఅ లిమా ఆతైత వలా మూతిఅ లిమా మనాత వలా యన్ఫవు జల్‌జద్ది మిన్కల్ జద్దు".

అనువాదం :- అల్లాహ్ తప్ప మరొకరెవరూ ఆరాధనకు తగినవారు కాదు. ఆయన ఏకేశ్వరుడు. ఆయనకు తోడు ఎవడూ లేడు. (యావత్తు) రాజ్యం ఆయనదే. (సర్వ) స్తోత్రాలు ఆయనకే. ప్రాణం పోసేవాడు, మృత్యువు ఇచ్చేవాడు కూడా ఆయనే. (సకల) శ్రేయోసాఫల్యాలు ఆయన అధీనంలోనే ఉన్నాయి. ఆయనే ప్రతి వస్తువుపై అధికారి. ఓ దేవా! నువ్వు ఇవ్వదలచిన దాన్ని ఎవరూ ఆపలేరు. నువ్వు ఏదయినా ఇవ్వదలచకపోతే దాన్ని ఎవరూ ఇప్పించనూలేరు. ఇంకా, ఏ ధనవంతుణ్ణీ అతని ధనం (నీ పట్టునుండి) తప్పించజాలదు.

లేక

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీకలహూ లహుల్ ముల్కు వ లహుల్‌హమ్దు వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్".

అనువాదం :- అల్లాహ్ తప్ప మరొక దేవుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు తోడు మరొక భాగస్వామి లేడు. (ఈ యావత్తు)

రాజ్యం ఆయనదే. (సకల) ప్రశంసలు ఆయన కొరకే. ఇంకా, ఆయన ప్రతి దానిపై శక్తికలిగి ఉన్నాడు.

లేక

"అస్తగ్ఫిరుల్లాహ్" (నేను అల్లాహ్‌తో క్షమాపణ కోరుతున్నాను) చదివి, ఆపైన ఇది చదవండి :

"అల్లాహుమ్మ అన్తస్సలాము వ మిన్కస్సలాము తబారక్త యా జల్‌జలాలి వల్ ఇక్రామ్".

అనువాదం :- ఓ అల్లాహ్ ! నువ్వే శాంతియుతుడవు. నీ తరఫు ననే శాంతి ఉంది (ప్రాప్తమవుతుంది).

ఘనత, శ్రేష్ఠతల ఓ యజమానీ !
ఓ కరుణా కటాక్షాల ప్రదాతా ! !
నువ్వెంతో గొప్ప దయాసాగరుడవు.

## "ఆయతుల్ కుర్సీ"

ఫర్జ్ నమాజ్ అనంతరం "ఆయతుల్ కుర్సీ" చదవటం ఎంతో ఉత్తమం; శుభప్రదాయిని.

"అల్లాహు లా యిలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూమ్. లా తాఖుజుహు సినతువ్వలా నౌమ్. లహు మాఫిస్స మావాతి వమా ఫిల్ అర్జి మన్‌జల్లజీ యష్‌ఫవు ఇన్దహు ఇల్లా బిఇజ్‌నిహీ యాలము మాబైన అయ్‌దీహిమ్ వమా ఖల్ఫహుమ్ వలా

యుహీతూన బిషయ్‌ఇన్ మిన్ ఇల్మిహీ ఇల్లా బిమాషాఅ వసిఅ కుర్సియ్యుహుస్సమావాతి వల్‌అర్జి వలా యవూదుహూ హిఫ్జుహుమా వహువల్ అలియ్యుల్ అజీమ్".

అనువాదం :- అల్లాహ్ - ఆయన తప్ప ఆరాధ్య దైవం ఎవ్వడూ లేడు. సకల చరాచరసృష్టికి మూలాధారం అయిన ఆయన సజీవుడు, నిత్యుడు, అనంతుడు, ఆయన నిదురపోడు, ఆయనను కునుకు కూడా రాదు. భూమ్యాకాశాల్లో ఉన్న సమస్తమూ ఆయనదే. ఆయన సమ్ముఖంలో ఆయన అనుజ్ఞ లేకుండా సిఫారసు చెయ్యగలవాడెవడు? ప్రజలముందు ఉన్నదాన్నీ ఆయన ఎరుగు: వారికి గుప్తంగా ఉన్నదీ ఆయనకు తెలుసు. ఆయన స్వయంగా తెలియజెయ్యాలని అభిలషిస్తే తప్ప ఆయనకున్న జ్ఞాన విశేషాల్లోని ఏ విషయమూ వారి గ్రహణాపరిధిలోకి రాదు. ఆయన రాజ్యాధికారం ఆకాశాలను, భూమిని పరివేష్టించి ఉంది. వాటి సంరక్షణ ఆయనకు ఎంతమాత్రం అలసట కలిగించదు. ఆయన మాత్రమే సర్వాధికుడు, సర్వోత్తముడు."
ఒక హదీసులో ఉంది:-

ఏ వ్యక్తి అయితే ప్రతిసారీ ఫర్జ్ నమాజ్ అనంతరం ఆయతుల్ కుర్సీ పఠిస్తాడో అతను స్వర్గంలో ప్రవేశించడం తప్ప దానికి మరో అర్థమే లేదు - అతడు జీవించి ఉన్నా మరణించి ఉన్నా సరే (అంటే, అతను మరణించిన తరువాత స్వర్గంలోకి వెళతాడని భావం).
మరొక ఉల్లేఖనం ఇలా ఉంది:-

ఫర్జ్ నమాజ్ అనంతరం 'ఆయతుల్ కుర్సీ' చదివే వ్యక్తి, ఆ తరువాతి నమాజ్ వరకు అల్లాహ్ రక్షణలో ఉంటాడు. ఈ విధంగా ప్రతి

నమాజ్‌లోనూ "ఆయతుల్ కుర్సీ" పఠించిన వారు ప్రతిరోజూ - ప్రత్యేకంగా - అల్లాహ్ సంరక్షణలో ఉంటారన్నమాట! (ఎంతో పవిత్రుడు ఆ ప్రభువు!)

## ఫజ్ర్ నమాజ్‌లో ప్రత్యేక దుఆలు

ఫజ్ర్ (ఉదయం పూట) నమాజ్ అనంతరం - నమాజ్‌లో ఏ విధంగా కూర్చుని ఉంటారో అదే విధంగా కూర్చుని - 10 సార్లుగాని, 100 సార్లుగాని కలిమయె తౌహీద్ పఠించండి:

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహు లా షరీకలహు లహుల్‌ముల్కు వలహుల్‌హమ్దు యుహ్యీ వ యుమీతు బి యదిహిల్ ఖైర్ వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్"

అదేవిధంగా యథాస్థానంలో కూర్చుని ఉండి, 7 సార్లు

"అల్లాహుమ్మ అజిర్నీ మినన్నార్" (ఓ దేవా! నువ్వు నన్ను నరకాగ్ని నుండి రక్షించు) అని పఠించాలి.

# భోజన నియమాలు-ప్రార్థనలు

భోజనానికి కూర్చున్నప్పుడు, భోజనం మనముందు వడ్డించబడి నపుడు "బిస్మిల్లాహ్" అని చెప్పి కుడిచేతితో తినటం మొదలెట్టాలి. తప్పనిసరి పరిస్థితుల్లో మినహా సాధారణంగా ఒంటరిగా భోజనం చేయ రాదు. తోడు ఉండే వారితో కలసి అన్నం తినాలి.

పెండ్లి భోజనాలలో గాని, లేక విందులలో వడ్డించిన రుచికర మయిన, ఆహ్లాదకరమయిన, స్వాదిష్టమయిన ఆహార పదార్థాలను సేవించే ముందు ఇలా ప్రార్థించాలి:

"బిస్మిల్లాహి వ అలా బరకతిల్లాహి"

అనువాదం:- "అల్లాహ్ పేరుతో! అల్లాహ్ చేత వొసంగబడిన దయానుగ్రహాలతో! (మేము ఈ విందును ఆరగిస్తున్నాము)."

## భోజనానికి ముందు...

మామూలుగా భోజనానికి కూర్చునే ముందు ఈ దుఆని పఠించాలి:

"అల్లాహుమ్మా బారిక్‌లనా ఫీహి వ అత్‌ఇమ్నా ఖైర మ్మిన్ హు"

"ఓ దేవా! నీవు ఈ ఆహారంలో వృద్ధిని ప్రసాదించు! ఇంకా, ఇంతకంటే మంచి ఆహారం తినిపించు."

## పాలు త్రాగేముందు...

"అల్లాహుమ్మా బారిక్ లనా ఫీహి వ జిద్ నా మిన్‌హు"

అనువాదం:- "ఓ దేవా! నీవు ఈ పాలలో వృద్ధిని ఇవ్వు. ఇంకా, ఇంతకంటే అధికంగా ఇవ్వు."

## భోజనా నంతరం...

అన్నం తిన్న తరువాత క్రింద ఇవ్వబడిన 'దుఆ' చేయాలి:

"అల్ హమ్దులిల్లాహిల్లజీ అత్అమనా వ సఖానా వజ్ అల్ నా మినల్ ముస్లిమీన్"

అనువాదం:- అల్లాహ్‌కు కృతజ్ఞతలు. ఆయన మనల్ని తినిపించాడు, త్రాగించాడు మరియు మమ్మల్ని ముస్లింలుగా చేశాడు.

(గమనిక:- ఒకవేళ ఒంటరిగా అన్నం తినేటట్టయితే "అత్ అమనా" బదులు "అత్ అమని" అని పలకాలి)

## ఆతిథ్యకుని కోసం ప్రార్థన

ఆతిథ్యకునికోసం, అంటే, భోజనం చేయించిన వారికోసం కూడా ప్రార్థించాలి.

"అల్లాహుమ్మ అత్ఇమ్ మన్ అత్ అమనీ వ సఖీమన్ సఖానీ"

అనువాదం:- "దేవా! ఎవరయితే నన్ను తినిపించాడో అతన్ని నువ్వు తినిపించు. ఎవరయితే నన్ను త్రాపాడో అతన్ని నువ్వు త్రాపు"

## కొత్త బట్టలు ధరించేటప్పుడు...

కొత్త బట్టలు ధరించేముందు ఈ విధంగా ప్రార్థించాలి:

అల్‌హమ్దు లిల్లాహిల్లజీ కసానీ హాజా వ రజఖనీహి మిన్ గైరి హౌలిమ్మిన్నీ వలా ఖువ్వతిన్"

అనువాదం:- శక్తివంతుడయిన అల్లాహ్‌కు కృతజ్ఞతలు. ఆయన నాకు ఈ వస్త్రాన్ని ధరింప జేశాడు. నా శక్తియుక్తుల ప్రమేయం లేకుండానే దీన్ని నాకు ప్రసాదించాడు."

వివరణ:- హదీసు ఒకటి ఉంది-

ఎవరయితే ఈ దుఆని పఠించి నూతన వస్త్రం ధరిస్తారో వారి భూత భవిష్యత్‌ల అపరాధాలు మన్నించబడతాయి.

## వధూవరుల కోసం...

ఎవరిదయినా పెండ్లి జరిగితే పెండ్లికొడుకు, పెండ్లికూతురు-ఇద్దరి కోసమూ దైవాన్ని వేడుకోవాలి.

"బారకల్లాహు లక వ బారకల్లాహు అలైక వ జమఅ బైనకుమ ఫీ ఖైరిన్"

అనువాదం:- అల్లాహ్ (మీకు) శుభం చేయుగాక! మీపై కరుణాను

గ్రహాలను కురిపించుగాక. ఇంకా, క్షేమంగా, ఉత్తమ రీతిలో కాపురం చేసే భాగ్యాన్ని మీకు ప్రసాదించుగాక!

## బాటసారి కోసం...

మీలో ఎవరయినా ప్రయాణానికి సిద్ధం అవుతున్నప్పుడు, సాగ నంపేవారు ప్రయాణీకుని కోసం ఇలా ప్రార్థించాలి.

"అస్ తవ్‌దివుల్లాహ దీనక వ అమానతక వ ఖవాతీమ అమలిక"

అనువాదం :- నేను మీ ధర్మాన్ని, మీ అమానతును, మీ ఆచరణ అంతాన్ని అల్లాహ్‌కు అప్పగిస్తున్నాను (ఆయనే అన్నింటి సంరక్షకుడు).

## ప్రయాణీకులు చేయవలసిన ప్రార్థన

ప్రయాణానికి బయలుదేరేటప్పుడు, ప్రయాణం నుండి వాపసు అయ్యేటప్పుడు ప్రయాణీకులు దైవాన్ని వేడుకొనాలి. ఏ వాహనం ద్వారా నయితే పయనమవవలసి ఉందో ఆ వాహనంలో అడుగుపెట్టగానే "బిస్మిల్లాహ్" అనాలి. వాహనంలో కూర్చున్నాక "అల్‌హమ్దులిల్లాహ్" అనాలి. అ తరువాత ఈ 'దుఆ' చదవాలి—

"సుబ్‌హానల్లజీ సఖ్ఖరలనా హాజా వమాకున్నా లహు ముఖ్రినీన్"

అనువాదం :- "పవిత్రుడాయన - ఎవరయితే ఈ వాహనాన్ని మాకు స్వాధీనం చేశాడో ! మేమయితే దీన్ని అదుపులోకి తీసుకురాలేక పోయేవారం. ఇంకా, మేమయితే మా ప్రభువు వైపుకే మళ్ళుతాము".

# మినాలో ఖుర్బానీ

హజ్ యాత్రకు వెళ్ళినపుడు (కాబా గృహం సందర్శించినపుడు) హాజీ 'మినా' అనే ప్రదేశంలో 'ఖుర్బానీ' ఇవ్వవలసి ఉంటుంది. ఖుర్బానీ ఇచ్చే సమయంలో పాటించవలసిన నియమాలను, పఠించవలసిన 'దుఆ' లను ఇక్కడ పొందుపరచటం జరిగింది :

1 మినాలో ఖుర్బానీ ఇచ్చే ముందు, "బిస్మిల్లాహి అల్లాహు అక్బర్" అని పలికి, ఖుర్బానీ పశుపు దవడపై కాలుపెట్టి కత్తి తిప్పాలి.

2. అప్పుడు ఈ సంకల్పం చేసుకోవాలి;

"అల్లాహుమ్మ తఖబ్బల్ మిన్నీ వమిన్ ఉమ్మతి ముహమ్మదిన్ సల్లల్లాహు అలైహి వ సల్లమ".

(ఓ దేవా ! నీవు నా తరపున మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం అనుయాయుల తరపున (దీన్ని) స్వీకరించు).

3 ఆ తరువాత ఈ క్రింది 'దుఆ' పఠించి 'జిబాహ్' చేయాలి.

"ఇన్నీ వజ్జహ్తు వజ్హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్ అర్జ అలా మిల్లతి ఇబ్రాహీమ హనీఫఁవ్వమా అనా మినల్ ముష్రికీన ఇన్న సలాతి వ నుసుకి వ మహ్యాయ వ మమాతి లిల్లాహి రబ్బిల్ ఆలమీన లా షరీకలహు వబిజాలిక ఉమిర్తు వ అన

అవ్వలల్ ముస్లిమీన అల్లాహుమ్మ మిన్క వలక బిస్మిల్లాహి వల్లాహు అక్బర్".

అనువాదం :- "నిస్సందేహంగా నేను నా ముఖాన్ని ఆ దేవుని వైపుకు త్రిప్పుకున్నాను - ఎవరయితే ఆకాశాలను, భూమిని సృష్టించాడో! (మరియు) ఆ-దరివైపు నుండీ ముఖాన్ని త్రిప్పుకుని ఇబ్రాహీం ధర్మంపై స్థిరంగా ఉన్నాను). ఖచ్చితంగా నేను బహు దైవోపాసకులలో లేను. నిశ్చయింగా నా నమాజ్, నా ఖుర్బానీ, నా జీవన్మరణాలు - అన్నీ సర్వ లోకాల ప్రభువయిన అల్లాహ్ కొరకే. (ఇంకా నేను సాక్ష్యమిస్తున్నాను) ఆయనకు సహవర్తులు ఎవరూ లేరు. దీన్ని గురించిన ఆదేశమే నాకు యివ్వబడింది. నేనయితే ఆజ్ఞాపాలన చేసేవారిలోని వాడనే. ఓ అల్లాహ్ ! ఈ ఖుర్బానీ నీ తరఫుననే (ఇవ్వబడుతోంది). ఇది నీ కోసమే. అల్లాహ్ పేరుతో (జిబాహ్) చేస్తున్నాను. అల్లాహ్ యే అందరికంటే గొప్పవాడు."

వివరణ :- మహాప్రవక్త మహమ్మద్ (సఅసం) తన పుత్రిక హజ్రత్ ఫాతిమా -హ్రా (ర.అ)తో అన్నారు - "లే. నీ విచ్చే ఖుర్బానీ దగ్గరకు వెళ్ళు. అది (ఖుర్బానీ పశువు) 'జిబాహ్' అవుతూ ఉండగా చూడు. ఎందుకంటే దాని మొదటి రక్తపుబొట్టు క్రిందపడగానే నువ్వుచేసిన పాపాలన్నీ క్షమించబడతాయి. ఇంకా నువ్వు, 'ఇన్నసలాతి వ నుసుకీ....' దుఆ పఠించు."

ఈ ఉపదేశాన్ని పురస్కరించుకుని, ఈ హదీసును ఉల్లేఖించిన ఇమ్రాన్ బిన్ హుసీన్ (ర.అ) అంతిమ దైవ ప్రవక్త (సఅసం) ను ఇలా అడిగారు - 'ఓ ప్రవక్తా ! ఈ పుణ్యం కేవలం మీ కుటుంబానికి మాత్రమే

ప్రత్యేకించబడిందా ?' ప్రవక్త (సఅసం) జవాబు యిచ్చారు – 'కాదు. ముస్లిములందరికీ ఇదే విధంగా పుణ్యం లభిస్తుంది'.

## అఖీఖా (AQEEQA)

ఒకవేళ అఖీఖా నిమిత్తం పశువును జిబాహ్ చేయవలసి ఉంటే; ఖుర్బానీ పశువు మాదిరిగానే అన్ని నియమాలు పాటించి, అదనంగా బిస్మిల్లాహి అఖీఖతు ఫలాన్" పఠించాలి.

'ఫలాన్' అంటే ఫలానా అని అర్థం. ఫలానా అని ఉన్నచోట బాలుని పేరో బాలిక పేరో చేర్చాలి.

## స్వస్థలానికి చేరుకునేముందు

మీరు మీ స్వంత బస్తీకి చేరువ కాగానే బస్తీలోకి ప్రవేశించే దాకా ఇలా ప్రార్థిస్తూ ఉండాలి.

"ఆయిబూన తాయిబూన ఆబిదూన లిరబ్బినా హామిదూన"

అనువాదం:- మేము (జిహాద్ ప్రయాణం నుండి) వాపసు అవబోతున్నాము. (మా స్వయం కృతాపరాధాలనుండి)పశ్చాత్తాపపడనున్నాము దాస్యం (ఆరాధన) చేయనున్నాము. మా ప్రభువును స్తుతించనున్నాము."

## ఇంట్లో ప్రవేశించే టప్పుడు...

ఇంట్లోకి ప్రవేశించేటప్పుడు ఈ 'దుఆ' పఠించండి;

"తౌబన్, తౌబన్. లి రబ్బినా ఔబన్. లా యుగాదిరు అలైనా హౌబన్"

అనువాదం:- (మేము మా ప్రభువు ఎదుట) పశ్చాత్తాపం చెందుతున్నాము పశ్చాత్తాపం. మా ప్రభువు కోసమే (మేము) మరలివచ్చాము.

మా పాపాల్లో దేనినీ ఆయన మిగల్చకుండుగాక! (అన్నింటినీ క్షమించుగాక!)

## కష్టకాలంలో...

1. ఎలాంటి దుఃఖం, విచారంలో పడిపోయినా, లేక కష్టాలు ఆసన్నమయినా ఆ సమయంలో ఈ 'దుఆ' చేయాలి

"లా యిలాహ ఇల్లల్లాహుల్ అజీముల్ హలీమ్. లా ఇలాహ ఇల్లల్లాహు రబ్బుల్ అర్షిల్ అజీమ్. లా ఇలాహ ఇల్లల్లాహు రబ్బుస్సమావాతి వల్ అర్జి వ రబ్బుల్ అర్షిల్ కరీమ్."

అనువాదం - అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. ఆయనెంతో గొప్పవాడు, దయార్ద్ర హృదయుడు, అల్లాహ్ తప్ప మరో దేవుడు లేడు. ఆయన సర్వోన్నత సింహాసనానికి ప్రభువు. అల్లాహ్ మినహా ఇంకొక దేవుడు లేడు. ఆయన భూమ్యాకాశాలకు ప్రభువు. కారుణ్య సింహాసనానికి అధిపతి.

2. కష్టకాలంలో ఈ విధంగా కూడా ప్రార్థిస్తూ ఉండండి-

హస్బునల్లాహ వ నీమల్ వకీల్ హస్బియల్లాహు వ నీమల్ వకీల్"

అనువాదం:- మాకు అల్లాహ్ చాలు, ఆయన గొప్ప కార్య నిర్వాహకుడు. నాకు అల్లాహ్ చాలు. ఆయన గొప్ప కార్యశీలుడు.

3. రోజుకు కనీసం మూడు సార్లు ఈ విధంగానూ ప్రార్థించండి.

"అల్లాహు రబ్బి లా ఉష్రికు బిహీ షయ్అన్"

(అల్లాహ్ నా ప్రభువు. ఆయనకు సహవర్తులుగా ఎవరినీ నిలబెట్టను)

లేక

4. ఇలా ప్రార్థించండి :

"అల్లాహుమ్మ రహ్మతక అర్జూ ఫలా తకిల్నీ ఇలా నఫ్సీ తర్ఫత అయ్నివ్వ అస్లిహ్ లీ షానీ కుల్లహు లా యిలాహ ఇల్లా అన్త"

అనువాదం :- దేవా ! నేను నీ కారుణ్యం మీదే ఆశ పెట్టుకున్నాను. కాబట్టి నువ్వు కంటిరెప్పపాటు సమయానికి కూడా నన్ను నా మనో వాంఛలకు అప్పజెప్పకు. ఇంకా, నా పనులన్నింటినీ సవ్యంగా ఉండేటట్లు చెయ్యి. నువ్వు తప్ప మరే ఆరాధ్య దైవమూ లేడు.

లేక

5. ఈ దుఆ చేయండి :

"యా హయ్యు యా ఖయ్యూము బిరహ్మతిక అస్తగీసు"

అనువాదం :- ఓ (నిత్యం) సజీవంగా ఉండేవాడా ! ఓ (సకల చరాచర సృష్టికి) మూలాధారకుడా !! నీ కారుణ్యం కోసమే పరితపిస్తున్నాను.

6. 'సజ్దా'లో ఉన్నప్పుడు కూడా "యా హయ్యు యా ఖయ్యూము" అని అనేకసార్లు పలుకుతూ ఉండాలి.

లేక

7. ఈ విధంగా ప్రార్థించాలి :

"లా యిలాహ ఇల్లా అన్త సుబ్హానక ఇన్నీకున్తు మినజ్జాలిమిన్"

అనువాదం :- నువ్వు తప్ప మరెవరూ ఆరాధనకు తగరు. నువ్వు పవిత్రుడవు. నిశ్చయంగా నేనే జులుం చేసే వారిలోని వాడను."

వివరణ :- ఒక హదీసు ఉంది—

"ఎవరయినాసరే ముస్లిం ఏ లక్ష్యంతోనయినా ఈ ఆయత్‌ను పఠించి దైవాన్ని వేడుకుంటే, దైవం అతని వేడుకోలును తప్పక స్వీకరిస్తాడు."

## ఎలాంటి కష్టంలోనయినా చేయవలసిన 'ప్రార్థన'

ఏ విధమయిన దుఃఖం గాని, ఆపదగాని వచ్చిపడినపుడు ఈ 'దుఆ'ను చదువుకోవాలి—

"అల్లాహుమ్మ ఇన్నీ అబ్దుక వబ్ను అబ్దిక వబ్ను అమతిక నాసియతి బియదిక మాజిన్ ఫీయ హుక్ముక ఆద్‌లున్. ఫీయ ఖజావుక అస్‌అలుక బికుల్లి ఇస్మిన్ హువలక సమ్మైతబిహీ నఫ్సక అవ్ అన్‌జల్తహు ఫీ కితాబిక అవ్ అల్లమ్తహు అహదమ్మిన్ ఖల్ఖిక అవిస్తాసర్త బిహీ ఫీ ఇల్మిల్ గైబి ఇన్దక అన్‌తజ్‌అలల్ ఖుర్

ఆనత్ అజీమ రబీఅ ఖల్బీ వ నూర హసరీ వ జిలాఅ హుజ్నీ వ జహాబ హమ్మీ."

అనువాదం :- ఓ దేవా ! నేను నీ దాసుణ్ణి. ఇంకా, నీ దాసుడు మరియు దాసీ యొక్క కుమారుణ్ణి (అంటే, నా తల్లిదండ్రులు కూడా నీ దాసులే) నా నుదురు నీ చేతిలో ఉంది. నీ యొక్క ప్రతి ఆదేశమూ నాకు వర్తిస్తుంది. నీ ప్రతి తీర్పూ నా యెడల న్యాయవంతమైనదే. నా ప్రతి పేరూ నీదే. నువ్వు స్వయంగా ఇతనికి (నీ) పేరు పెట్టావు లేక దాన్ని నీ గ్రంథంలో అవతరింపజేశావు. లేక నీ సృష్టితాలలో (మానవ కోటిలో) ఎవరో ఒకరికి తెలియజేశావు. లేక నీవు అగోచరజ్ఞానంతో నీ దగ్గరే భద్రంగా ఉంచుకున్నావు. దివ్య ఖుర్ఆన్‌ను నా మనోకాంతిగా నా దుఃఖాన్ని, కష్టాల్ని దూరంచేసే సాధనంగా చెయ్యమని నిన్ను అర్థిస్తున్నాను.

# ముఖ్యమయిన దుఆలు

ఇంతవరకు ప్రస్తావించబడిన ప్రార్థనలు కాక, ముస్లిం దైనందిన జీవితంలో మరెన్నో ముఖ్యమయిన ప్రార్థనలు ఉన్నాయి. అసలు, ముస్లిం అంటేనే విధేయత చూపేవాడు, ఆజ్ఞాపాలన చేసేవాడని అర్థం. సహాయం కొరకు అతడు తన ప్రభువుపైనే ఆశలు పెట్టుకుంటాడు. అత్యంత వినయ వినమ్రతలలో, భయభక్తులతో నిజస్వామిని వేడుకుంటాడు. తన పోషకుని అపార కరుణానుగ్రహాలకు ప్రతిగా కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. ఇందులో ఎన్నో పవిత్రమయిన, పరిశుద్ధమయిన భావాలు ఇమిడి ఉన్నాయి.

'ప్రార్థనల' ఈ పరంపరలో అతి ముఖ్యమయిన మరికొన్ని ప్రార్థనలను యిక్కడ పొందుపరుస్తున్నాము. చిత్త శుద్ధితో వీటిని ఆచరించేవారు నిస్సందేహంగా ప్రయోజనం పొందుతారని ఆశించవచ్చు.

## వర్షపు విపత్తులనుండి రక్షణకొరకు...

ఆకాశం మేఘావృతమయి వర్షం కురవటం మొదలెట్టగానే ఇలా ప్రార్థించాలి.

"అల్లాహుమ్మ స్వయ్యిబన్నాఫిఆ"

అనువాదం:- "ఓ దేవా! పుష్కలంగా కురిసే, లాభం చేకూర్చే వర్షం కురిపించు:

## నెలపొడుపు చూచినపుడు

నెలపొడుపు చూచినపుడు 'అల్లాహు అక్బర్' అని పలికి, ఆ తరువాత ఇలా వేడుకోవాలి :

"అల్లాహుమ్మ అహిల్లహు అలైన బిల్‌యుమ్నివల్ ఈమాని వస్సలామతి వల్ ఇస్లామి వత్తవ్ఫీఖి లిమా తుహిబ్బు వతర్జా రబ్బీ వ రబ్బుకల్లాహ్."

అనువాదం :- ఓ దేవా ! నీవు ఈ చంద్రుడ్ని వృద్ధివికాసాలతో, విశ్వాసంతో, శాంతిశ్రేయాలతో తియ్యి. (ఈ చంద్రుడు) నీకు ప్రసన్నమయిన విధంగా మెలిగే ఉద్దేశ్యంతో తియ్యి. ఓ చంద్రా ! నా ప్రభువు, నీ ప్రభువూ - మనిద్దరి ప్రభువూ అల్లాహ్‌యే."

## షబ్-ఇ-ఖద్ర్ (శ్రేష్ఠమయిన రాత్రి)

షబేఖద్ర్ (ఘనమయిన రాత్రి)ని పొందిన భాగ్యం మీకు కలిగినప్పుడల్లా, మీరు ఆ రాత్రిన ఈ 'దుఆ'ను అత్యధికంగా చేయండి; ఎందుకంటే 'షబేఖద్ర్' వేయి రాత్రుల కంటే కూడా విలువయినది :

"అల్లాహుమ్మ ఇన్నక అఫువ్వున్ తుహిబ్బుల్ అఫ్వ ఫాఫు అన్నీ."

అనువాదం :- ఓ దేవా ! నిస్సందేహంగా నువ్వు ఎక్కువగా క్షమించేవాడవు. క్షమ అంటే నువ్వెంతో ఇష్టపడతావు. కనుక నువ్వు నన్ను క్షమించు."

## అద్దం చూచుకున్నప్పుడు

అద్దంలో మీ ముఖం చూచుకున్నప్పుడల్లా ఈ విధంగా ప్రార్థించండి :
"అల్లాహుమ్మ అన్త హస్సన్త ఖల్ఖీ ఫహస్సిన్ ఖులుఖీ"

అనువాదం:- "దేవా! నా ముఖాన్ని ఇంత అందంగా తీర్చిదిద్దింది నువ్వే. కాబట్టి నా శీలాన్ని కూడా నువ్వే ఉన్నతంగా చేయి."

## తుమ్మినప్పుడు

ఎప్పుడయినా సరే తుమ్ము వచ్చినప్పుడు ఈ విధంగా 'దుఆ' చేయాలి-

"అల్‌హమ్దు లిల్లాహ్" (అల్లాహ్‌కు కృతజ్ఞతలు). తుమ్మిన వ్యక్తి 'అల్‌హమ్దు లిల్లాహ్' అని పలకగానే అది విన్నవాడు దానికి బదులుగా (అతని కోసం)

"యర్‌హము కల్లాహ్" (అల్లాహ్ నీపై కరుణించుగాక!) అని పలకాలి.

## శుభవార్త విన్నప్పుడు

ఏదయినా శుభవార్తను విన్నప్పుడు. లేక శుభవార్తను గురించి ఎక్కడయినా చదివినప్పుడు, దైవానికి కృతజ్ఞతగా ఇలా పలకాలి:

"అల్‌హమ్దు లిల్లాహ్"
(అల్లాహ్‌కు కృతజ్ఞతలు)

## సిరిని చూచినపుడు

ఎప్పుడయినా మకం గాని లేక మన సంతానంగాని మంచి స్థితిలో ఉండవచ్చు; మన సిరిసంపదలలో సమృద్ధి అగుపించవచ్చు; లేక ఇతరులు సిరిసంపదలతో తుల తూగుతున్నట్లు కానరావచ్చు. అటువంటి సమయాలలో పలకవలసిన 'దుఆ' ఇది:

"అల్లాహుమ్మ బారిక్ ఫీహి"
(ఓ దేవా! నీవు ఇందులో మరింత సమృద్ధిని ప్రసాదించు)

## పరుల త్యాగ గుణం చూచి...

ఎవరయినా ముస్లిం సోదరుడు తన పిల్లా జల్లను లేక ధనాన్ని పరోపకార బుద్ధితో త్యాగం చేసినపుడు, దానికి ప్రతిగా ఇలా పలకాలి:

"బారకల్లాహు ఫీ అహ్‌లిక వ మాలిక"

(అల్లాహ్ మీ పిల్లాజల్లలో, మీ ధన సంపదలో వృద్ధిని వొసంగు గాక!)

## ఇష్టమయిన వస్తువును చూడగానే...

మీరెప్పుడయినా మీకు ఇష్టమయిన వస్తువును చూచినపుడల్లా ఇలా వేడుకొనండి:

అల్‌హమ్దు లిల్లాహిల్లజీ బి నీమతిహీ తతిముస్సాలిహాత్"

(ఎవరి కటాక్షంతోనయితే సత్కార్యాలు సంపూర్తి అవుతాయో ఆ ప్రభువుకే సకల స్తోత్రాలు).

## అసహ్యకరమయిన వస్తువు తారసపడినపుడు...

ఎప్పుడయినా మీకు అసహ్యకరమయిన, పరమ జుగుప్సాకర మయిన వస్తువుగాని, పదార్థంగాని తారసపడవచ్చు. లేక అలాంటిదే మరే దయినా సంఘటన జరగవచ్చు. అప్పుడు ఇలా పలకాలి.

అల్ హమ్దు లిల్లాహి అలాకుల్లి హాల్"

(అన్ని అవస్థలలోనూ (పరిస్థితులలోనూ) అల్లాహ్ కే కృతజ్ఞతలు,

## సమావేశం నుంచి నిష్క్రమించే వేళ...

మనిషి ఎప్పుడయినా, ఏదైనా సమావేశంలోనో, చర్చలలోనో పాల్గొన్నప్పుడు అతని నోటి ద్వారా వెలువడే మాటలు కొన్ని ఎదుటివారి మనసుకు బాధ కలిగించవచ్చు. మనిషి ఎంతైనా మనిషే. అతడెంతగా జాగ్రత్తపడినా ఎక్కడో ఒకచోట, ఏదో ఒక విధంగా - తనకు తెలియ కుండానే పొరపాటు చేయవచ్చు.

అందుకనే సమావేశం నుండి నిష్క్రమించేప్పుడు దైవ స్తోత్రం చేయాలని, పొరపాట్ల మన్నింపు కోసం విశ్వ ప్రభువుని ప్రార్థించాలని దేవుని చిట్టచివరి ప్రవక్త (సఅసం) బోధించారు - ఆ విధంగా చేసే ప్రార్థనలలో ఒకదాన్ని మచ్చుకు ఇక్కడ పొందుపరుస్తున్నాము :

"సుబ్ హానక అల్లాహుమ్మ వబిహమ్దిక అష్హదు అన్ లా యిలాహ ఇల్లా అన్త అస్తగ్ఫిరుక వ అతూబు ఇలైక."

అనువాదం :- "ఓ దేవా ! నేను నీ స్తోత్రంతోపాటు నీ పవిత్ర ...

తను కొనియాడుతున్నాను. నువ్వు తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడని సాక్ష్యమిస్తున్నాను. నా అపరాధాల మన్నింపుకై వేడుకుంటున్నాను. ఇంకా, నీ సన్నిధానంలో పశ్చాత్తాప పడుతున్నాను."

## పిచ్చివాడికి చికిత్స

మతి స్థిమితంలేని మనిషి (పిచ్చివాని) కోసం మూడు రోజుల వరకు - ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం - ఫాతిహా సూరా చదివి అతనిపై ఊదాలి. సూరా ముగిసేటప్పుడు నోటిలోని ఉమ్మునంతటినీ సమీకరించుకుని అతనిపై ఉమ్మివేయాలి.

## పాము, తేలు కాటేసిన వేళ...

1. పాముగాని, తేలు గాని కాటేసిన వ్యక్తిపై 7 సార్లు ఫాతిహా సూరా పఠించి ఊదాలి.

2. మంచినీరు మరియు ఉప్పు కలిపి కాటువేసిన చోట రుద్దాలి (తోమాలి). తరువాత "ఖుల్‌యా అయ్యుహల్ కాఫిరూన్", "ఖుల్ అవూజు బిరబ్బిల్ ఫలఖ్", "ఖుల్ అవూజు బిరబ్బిన్నాన్" సూరాలు పఠించి ఊదాలి.

## శారీరక బాధ దూరం అయ్యేందుకు...

ఏ వ్యక్తికయినా శారీరకంగా బాధగాని, నొప్పిగాని ఉంటే వారు తమ కుడిచేతిని నొప్పి ఉన్నచోట ఉంచి మూడుసార్లు "బిస్మిల్లాహ్" అని పలకాలి. ఆ తరువాత ఈ దుఆ పఠించాలి :

"అవూజు బిల్లాహి వ ఖుద్రతిహీ మిన్‌షర్రి మా అజిదు వ వుహాజరు."

అనువాదం :- నాకు కలుగుతున్న బాధ, దాని దుష్ప్రభావాల నుండి నేను అల్లాహ్ మరియు ఆయన శక్తియుక్తుల శరణు పొందుతున్నాను.

లేక

నొప్పి ఉన్నచోట కుడిచేతిని ఉంచి ఈ క్రింది 'దుఆ'ను కూడా చదవవచ్చు :

"అవూజు బిఇజ్జతిల్లాహి వ ఖుద్రతిహీ అలాకుల్లి షయ్యిమ్మిన్ షర్రి మా అజిద్."

అనువాదం :- నాకు కలుగుతున్న బాధ నుండి నేను అల్లాహ్ యొక్క గౌరవం మరియు ప్రతివస్తువుపై ఆయనకున్న ఆధిపత్యం యొక్క శరణు పొందుతున్నాను."

## రోగగ్రస్తుడ్ని పరామర్శించినపుడు...

ఎవరయినా జబ్బు పడిన వారిని-అస్వస్థతకు గురైన వారిని-పరామర్శించినపుడు ఈ విధంగా ప్రార్థించాలి:

లా బాస తహూరున్ ఇన్‌షా అల్లాహ్-లా బాస తహూరున్ ఇషా అల్లాహ్"

అనువాదం:- కంగారుపడవలసిన విషయమేమీలేదు. దైవ చిత్తమ

యితే ( ఈ జబ్బు అంతర్బాహ్యాల మలినాన్ని) శుభ్రపరచనున్నది. కంగారు పడవలసిన పని ఏమీలేదు. దైవ చిత్తమయితే (ఈ వ్యాధి అంతర్బాహ్యాల అశుద్ధాన్ని పరిశుద్ధపరచనున్నది.

మరి

రోగగ్రస్తుని కుడి చేతిని అతని శరీరంపై త్రిప్పుతూ ఇలా పఠించాలి;

"అల్లాహుమ్మ అజ్హిబిల్ బాస రబ్బన్నాసి ఇష్ఫిహీ వ అన్తష్షాఫి లా షిఫాఅ ఇల్లా షిఫావుక షిఫావుల్లా యుగాదిరు సఖ్మా"

అనువాదం:–"ఓ దేవా! బాధను దూరం చెయ్యి. (ఓ) ప్రజల ప్రభూ! ఈ రోగగ్రస్తునికి "నివారణ" (స్వస్థత) చేకూర్చు ఇంకా, నువ్వే "నివారణ"ను ప్రసాదించేవాడవు. నీ నివారణ తప్ప మరే నివారణా లేదు. ఏ రోగమూ మిగలని నివారణను ప్రసాదించు"

## ఎవరి పిల్లవాడైనా చనిపోయినపుడు...

ఎవరి పిల్లవాడైనా చనిపోతే వారు,

"అల్హమ్దు లిల్లాహి అలాకుల్లి హాలిన్"

మరియు

"ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్" పఠించాలి.

వివరణ:– ఒక హదీసు ఉంది—

ఎవరయినా (ముస్లిం) దాసుని పిల్లవాడు చనిపోతే విశ్వప్రభువయిన అల్లాహ్ దూతలను పిలిచి అడుగుతాడు - మీరు నా దాసుని కొడుకు ఆత్మను (ప్రాణాన్ని) స్వాధీనం చేసుకున్నారు దూతలు సెలవిస్తారు. "అవును ప్రభూ !" అప్పుడు అల్లాహ్ అంటాడు - 'మీరు అతని హృదయానికి హత్తుకునిఉండే పుష్పాన్ని కోసుకున్నారు. దైవదూతలు అంటారు', 'అవును ప్రభూ ! మేమీ పనిచేశాము'. అప్పుడు విశ్వప్రభువు అంటాడు- 'ఇది చూచిన నా దాసుడు ఏమన్నాడు ? దూతలు సమాధానమిస్తారు - 'అతను, అల్‌హమ్దు లిల్లాహ్ అన్నాడు. ఇంకా, "ఇన్నాలిల్లాహి వ యిన్నా ఇలైహి రాజిఊన్" అని పఠించాడు ప్రభూ !' అల్లాహ్ ఆజ్ఞాపిస్తాడు— '(వెళ్ళండి) నా ఈ దాసుని కొరకు స్వర్గంలో ఒక మహలును నిర్మించండి. ఆ మహలుకు "బైతుల్ హమ్ద్" అని పేరు పెట్టండి.

## జనాజా నమాజ్ - 'దుఆ'లు

జనాజా నమాజ్ పూర్తయిన తరువాత, ఈ క్రింది 'దుఆ' పఠించాలి:

"అల్లాహుమ్మగ్ఫిర్లీ హయ్యినా వ మయ్యితినా వ సగీరినా వ కబీరినా వ జకరినా వ ఉన్సానా వ షాహిదినా వ ఘాయిబినా అల్లాహుమ్మ మన్ అహ్యయ్‌తహూ మిన్నా ఫ అహ్యియిహీ అలల్ ఇస్లామి వమన్ తవప్ఫయితహూ మిన్నా ఫతవప్ఫహూ అలల్ ఈమాన్. అల్లాహుమ్మ లా తుహ్‌రిమ్నా అజ్‌రహూ వలాతుజిల్లనా బాదహూ"

అనువాదం:- ఓ దేవా! నీవు మా సజీవులను-మృతులను, చిన్న లను-పెద్దలను, పురుషులను-స్త్రీలను, ఉన్న వారినీ-లేని వారినీ క్షమించు. స్వామీ! మాలో ఎవరిని సజీవంగా ఉంచినా ఇస్లాంపై స్థిరంగా ఉంచు ఎవరికి మృత్యువు ఆసన్నమయినా అతను విశ్వాసం (ఈమాన్)పై ఉన్న స్థితిలో మృత్యువు వచ్చేటట్లుగా చెయ్యి. దేవా! దీని (ఓర్పుయొక్క) ప్రతి ఫలాన్ని అందుకోలేని నిర్భాగ్యుడిగా చెయ్యకు మరియు దీని తరువాత (మరణానంతరం) మమ్మల్ని మార్గ భ్రష్టతకు లోను చెయ్యకు.

## శవాన్ని సమాధిలో దించేటప్పుడు

శవాన్ని సమాధి (గోరీ)లో దించేటప్పుడు ఇలా ప్రార్థించాలి:

"బిస్మిల్లాహి వ అలా సున్నతి రసూలిల్లాహి సల్లల్లాహు అలైహి వ సల్లం"

అనువాదం:- అల్లాహ్ పేరుతో మరియు ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం సంప్రదాయంపై (మేము యితని అంత్యక్రియలు జరుపు తున్నాము)

లేక

ఈ 'దుఆ'ను అయినా పఠించవచ్చు :

"మిన్‌హా ఖలఖ్‌నాకుమ్ వ ఫీహా నుయీదుకుమ్ వ మిన్‌హా నుఖ్రిజుకుమ్ తారతన్ ఉఖ్‌రా బిస్మిల్లాహి వ ఫీసబీలిల్లాహి వ అలా మిల్లతి రసూలిల్లాహి".

అనువాదం :- "ఈ భూమితోనే (మట్టితోనే) మేము మిమ్మల్ని పుట్టించాము. ఈ భూమిలోకే మిమ్మల్ని పంపిస్తాము. ఇంకా, ఈ భూమిలో నుండే (ప్రళయదినాన) తిరిగి లేపుతాము- అల్లాహ్ పేరుతో, అల్లాహ్ మార్గంలోనే మరియు దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ధర్మం పైనే (మేము ఇతని అంత్యక్రియలు జరిపాము)".

శవాన్ని ఖననం చేసిన తరువాత, సమాధి దగ్గర నిలబడి బఖరా సూరా యొక్క మొదటి రుకూను (అలిఫ్-లామ్-మీమ్ నుండి ఉలాయిక హుముల్ ముఫ్లిహూన్ వరకు), బఖరా సూరా యందలి చివరి రుకూలో "ఆమన రసూలు బిమా ఉన్‌జిల నుండి కాఫిరూన్ వరకు" పఠించాలి.

## సమాధులను దర్శించినపుడు

ఎప్పుడయినా సమాధులను సందర్శించే నిమిత్తం శ్మశానానికి వెళ్ళినపుడు ఇలా ప్రార్థించాలి :

"అస్సలాము అలైకుమ్ అహ్లద్దియారి మినల్ మూమినీన వల్ ముస్లిమీన వ ఇన్నా ఇన్‌షా అల్లాహు బికుమ్ లలాహిఖూన్. నస్అలుల్లాహ లనా వలకుముల్ ఆఫియత అన్తుమ్ లనా ఫరతున్వ నహ్నూ లకుమ్ తబవున్".

అనువాదం :- ఓ (ఈ) బస్తీవాసులారా ! ముస్లింలారా ! మీపై శాంతికలుగుగాక ! దైవ చిత్తమయితే నిస్సందేహంగా మేము కూడా త్వరలో మిమ్మల్ని కలుసుకోబోతున్నాం. మేము అల్లాహ్‌ను-మా కోసం మీ కోసం

కూడా క్షమాభిక్ష కొరకు వేడుకుంటున్నాము. మీరు మా కంటే ముందర వెళ్ళిపోయినవారు. మేము మీ వెనుకనే వచ్చేవారము.

## "ఇస్తిగ్ఫార్" పద్ధతి

1. 'ఇస్తిగ్ఫార్' చెయ్యటం అంటే పాపాల క్షమాపణ కొరకు దైవాన్ని వేడుకోవటం అని అర్థం.

"అస్తగ్ఫిరుల్లాహ్, అస్తగ్ఫిరుల్లాహ్" అని తరచూ వీలయినంత ఎక్కువగా పఠిస్తూ ఉండాలి

2. ఇస్తిగ్ఫార్ భావాన్ని, దాని ప్రాముఖ్యతను మదిలో మెదిల్చు కుంటూ ఏకాగ్రతతో, ఈ క్రింది కలిమాతోపాటు 3 సార్లుగాని, 7 సార్లు గాని క్షమాభిక్ష కోసం నిజ ప్రభువుకు విన్నవించుకోవాలి.

"అస్తగ్ఫిరుల్లాహల్లజీ లా యిలాహ ఇల్లా హువల్ హయ్యుల్ ఖయ్యూము వ అతూబు ఇలైహి"

అనువాదం:- నేను ఆ దైవాన్ని క్షమాభిక్ష కోరుతున్నాను-ఎవరి మినహాయితే మరో దైవం లేడో; ఆయన (నిత్యం) సజీవంగా ఉండేవాడు. (భూమ్యాకాశాల) మూలాధారకుడు. ఆయన ముందే పశ్చాత్తాపం చెందు తున్నాను.

## మల విసర్జనకు ముందు...

అన్నపానీయాలను సేవించేటప్పుడు, ప్రయాణానికి ముందు బయలు దేరేటప్పుడు. నిద్రపోయేటప్పుడు 'దుఆ'లు చేసేవిధంగా మల మూత్ర

విసర్జన సమయంలో కూడా 'దుఆ' చేయటం సభ్యత అనిపించుకోదు. అయితే మల విసర్జన కోసం ఆ ప్రాంతానికి (దొడ్డికి) బయలు దేరేముందు మరియు విసర్జన అయిపోయిన తరువాత ఈ విధంగా పలకాలి:

"అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మినల్ ఖుబుసి వల్ ఖబాయిసి"

అనువాదం:- ఓ దేవా! ఖబీసుల * నుండి, ఖబీసురాళ్ళ నుండి నేను నీ శరణు కోరుతున్నాను.

వివరణ:—ఈగలు, పురుగులు, తదితర కీటకాలు ఏ విధంగా నయితే మురికిపై ముసురుకుంటాయో అదే విధంగా ఖబీస్‌లు, షైతాన్‌లు, వేరే అశుద్ధ జీవరాసులు మురికి ప్రాంతాలను, మరుగు దొడ్లను అత్యంత అధికంగా ఇష్టపడతారు. వారు ఆ గలీజు ప్రాంతాలలోనే అధికంగా ఉంటారు. అందుచేతనే అలాంటి ప్రదేశాలకు పోయేముందు పై "దుఆ" పఠించి మరీ పోవాలని దైవ సందేశహరులు (సఅసం) బోధించారు. మహా ప్రవక్త (సఅసం) కూడా స్వయంగా ఈ నియమాన్ని పాటించేవారని, ఆయన సన్నిహిత సహచరులు హజ్రత్ అనస్ (ర.అ) ఉల్లేఖించారు.

## బజార్లలో...

బజారులలో సాధారణంగా ఉద్రిక్తత అలముకుని ఉంటుంది. మనోవాంఛలు మనిషిని ఎటుపడితే అటు లాక్కెళ్ళడానికి ప్రయత్నిస్తుంటాయి. దుర్మార్గుడైన షైతాన్ మనిషిని మార్గభ్రష్టతకు లోనుచేయడానికి

* 'ఖబీస్' అనే వాడు కూడా షైతాన్ కోవకు చెందినవాడే. వాడు అశుద్ధతను, మురికిని ఎంతో ఇష్టపడతాడు.

మా చేసి ఉంటాడు. ఇటువంటి నాజూకు సమయంలో దాసుడు దైవాన్ని జ్ఞాపకం చేస్తే దానికి అసాధారణమయిన ప్రతిఫలం ప్రాప్తమవుతుందని పేర్కొనటం జరిగింది :

"లా యిలాహ ఇల్లల్లాహు వహ్దహు లా షరీకలహు లహుల్ముల్కు వ లహుల్హమ్దు యుహ్యీ వ యుమీతు వహువ హయ్యున్ లా యమూతు బియదిహిల్ ఖైర్ వహువ అలాకుల్లి షయ్యిన్ ఖదీర్".

అనువాదం :- అల్లాహ్ తప్ప మరో ఆరాధ్య దైవం లేడు. ఆయన ఏకేశ్వరుడు ఆయనకు మరొకరెవరూ సహవర్తులు లేరు. రాజ్యం ఆయనదే. ప్రశంసలకు, పొగడ్తలకు అర్హుడు ఆయనే. అందరి జీవన్మరణాలు ఆయన అధీనంలోనే ఉన్నాయి. ఆయన సజీవుడు, నిత్యుడు, ఆయనకు నాశనం అంటూ లేదు. సకల శ్రేయోసాఫల్యాలు ఆయన స్వాధీనంనే ఉన్నాయి.

## మార్గ విహీనతకు, కష్టాలకు లోనై ఉన్నవారిని చూచినపుడు...

దైనందిన జీవితంలో మనం ఎందరినో చూస్తూ ఉంటాం. ఒండొకరి మంచీ చెడ్డలను గురించి అడిగి తెలుసుకుంటూ ఉంటాం. సుఖ దుఃఖాలకు సంబంధించినంతవరకు కొన్నిసార్లు పోలికలూ ఉంటాయి. వైవిధ్యమూ ఉంటుంది.

అయితే కష్టాలకు గురయి ఉన్నవారిని చూచినపుడు, దైవాన్ని, పరలోక జీవితాన్ని విస్మరించి అంధకారంలో కొట్టుమిట్టాడుతున్న వారిని చూచినప్పుడల్లా ఈ విధంగా దైవాన్ని వేడుకోవాలి :

"అల్‌హమ్దు లిల్లాహిల్లజీ ఆఫానీ మిమ్మాబ్ తలాక బిహీ వ ఫజ్జలనీ అలా కసీరిన్ మిమ్మన్ ఖలఖ తఫ్‌జీలా"

అనువాదం:- నువ్వు లోనయిఉన్న కష్టాలు, పీడల నుండి ఎవరయితే నన్ను భద్రంగా ఉంచాడో, ఇంకా నాకు సౌఖ్యాన్ని ప్రసాదించాడో ఆ దైవానికి కృతజ్ఞతలు. ఇంకా ఆయన, తన సృష్టితాలలో చాలా వాటిపై నాకు ఆధిక్యాన్ని, పెద్దరికాన్ని ఇచ్చాడు

## భార్యతో కలిసేటప్పుడు...

భార్యవద్దకు వెళ్ళినపుడు-భార్యతో లైంగిక కోర్కెను తీర్చుకునే ముందు-ఈ 'దుఆ' చేయాలి-

"బిస్మిల్లాహి అల్లాహుమ్మ జన్నిబ్ నష్షయ్‌తాన వ జన్నిబి షషయ్‌తాన మా రజఖ్‌తనా".

అనువాదం:-"అల్లాహ్ పేరుతో, ఓ అల్లాహ్! షైతాన్ బారినుండి నువ్వు మమ్మన్ని కాపాడు, ఇంకా నువ్వు మాకు ప్రసాదించే మా సంతానాన్ని కూడా షైతాన్ బారినుండి రక్షించు."

# సమగ్రమయిన ప్రార్థనలు

ఇక్కడ కొన్ని 'దుఆ' (ప్రార్థన)లను పొందు పరుస్తున్నాము. పరిమాణం దృష్ట్యా ఇవి చిన్న చిన్న 'దుఆ'లే అయినా భావ పరంగానూ, పరమార్థం రీత్యాను ఎంతో సమగ్రమయినవి. నమాజ్ అనంతరం ఈ దుఆలను చేయవచ్చు. సాధారణ సమయాలలో వీటిని స్మరిస్తూ ఉండవచ్చు. దేవుని అంతిమ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) కూడా ఈ "దుఆ"లనే అత్యధికంగా పఠిస్తూ ఉండేవారు.

1. "అల్లాహుమ్మ రబ్బనా ఆతినా ఫిద్దున్యా హసనతవ్వఫిల్ ఆఖిరతి హసనతవ్వఖినా అజాబన్నార్"

అనువాదం:- ఓ నా దేవా! ప్రభువా!! ప్రపంచంలో కూడా మాకు మేలు చేయి, పరలోకంలో కూడా సాఫల్యం అనుగ్రహించు. ఇంకా, మమ్మల్ని నరకాగ్ని నుండి కాపాడు.

2. "అల్లాహుమ్మజ్ అల్నీ షకూరన్ వజ్అల్నీ సబూరన్ వజ్ అల్నీ ఫీ అయ్‌నీ సగీరన్ వఫీ అయ్యునిన్నాసి కబీరా"

అనువాదం:-ఓ అల్లాహ్! నాపై నేను కృతజ్ఞతలు తెలుపుకునే వాడ్నిగా, ఓర్పు వహించే వాడ్నిగా నన్ను మలచు. నా దృష్టిలో నన్ను చిన్నవాడ్నిగానే ఉంచు (అయితే) పరుల దృష్టిలో నన్ను పెద్దవాడ్నిగా చేయి."

3. "అల్లాహుమ్మ అహ్సిన్ ఆఖిబతనా ఫిల్ ఉమూరి కుల్లిహా వ అజిర్‌నా మిన్‌ఖిజ్‌యిద్దున్యా వ అజాబిల్ ఆఖిరతి"

అనువాదం:-"ఓ అల్లాహ్! మా పనులన్నింటి పర్యవసానాన్ని సఫలీకృతం చెయ్యి. ప్రాపంచిక దురాచారాలనుండి, పరలోక శిక్షనుండి మమ్మల్ని కాపాడు. ఇంకా మమ్మల్ని భద్రంగా ఉంచు."

4. "అల్లాహుమ్మ తహ్హిర్ ఖల్బీ మినన్నిఫాఖి వ అమలి మినర్రియాఇ వ లిసానీ మినల్ కిజ్‌బి వ అయ్‌నీ మినల్ ఖియానతి ఫ ఇన్నక తాలము ఖాయినతల్ ఆయుని వమా తుఖ్ ఫిస్సుదూర్"

అనువాదం:- "ఓ అల్లాహ్! నా హృదయాన్ని కాపట్యం నుంచి, నా ఆచరణలను ప్రదర్శనా బుద్ధినుంచీ, నా నాలుకను అబద్ధపు బారి నుంచీ, నా కళ్ళను చెడు చూపు నుంచీ పూర్తిగా, స్వచ్ఛంగా, పవిత్రంగా ఉంచు. నువ్వు కంటి చూపుల్లోని దురుద్దేశ్యాలను, హృదయాల్లో దాగిఉన్న రహస్యాలను సయితం ఎరిగిన వాడవు. నా దగ్గర వున్న ఏ వస్తువూ నీకు తెలియకుండా లేదు"

5. "అల్లాహుమ్మగ్ఫిర్లీ జన్‌బీ వ వస్సిలీ ఫీదారీ వ బారిక్‌లీ ఫీమా రజక్ తనీ"

అనువాదం :- ఓ దేవా ! నా అపరాధాలను మన్నించు. నా కోసం నా ఇంట్లో విశాలతను అనుగ్రహించు. ఇంకా, నువ్వు నాకు ఏ ఆహారమయితే ప్రసాదించావో అందులో సమృద్ధిని కల్పించు.

6. "అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మిన్ జహ్‌దిల్ బలాయి వ దర్కిష్షిఖాయి వ సూయిల్‌ఖజాయి షమాతతిల్ ఆదాయి."

అనువాదం :- ఓ దేవా ! పీడల బాధనుండీ, దుస్సహం నెలకొనటం నుండీ, (దైవం తరఫున సంభవించే) విపత్తుల నుండీ, శత్రువుల అవహేళన, దెప్పిపొడవటాల నుండి నేను నీ శరణు కోరుతున్నాను.

7. "అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మినల్ హమ్మి వల్ హుజ్నివల్ అజ్‌జి వల్ కస్లి వల్ జుబ్ని వల్‌బుఖ్లి వ జలయిద్దైని (ZALA-I-DDAINI) వ గలబతిర్రిజాలి."

అనువాదం :- ఓ నా దేవా ! విచారం నుండీ, దుఃఖం నుండీ మనోస్థయిర్యం కొరవడటం నుండీ, సోమరితనం పిరికితనాల నుండీ పిసినారితనం నుండీ, అప్పుల నుండీ, ప్రజల ఒత్తిడి నుండీ నేను నీ శరణు కోరుతున్నాను.

8. "అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మినల్ కస్లి వల్ హరమి వల్ మగ్రమి వల్‌మాసమి. అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మిన్ అజాబిన్నారి వ ఫిత్నతిన్నారి వ ఫిత్నతిల్ ఖబ్రి వ అజాబిల్ ఖబ్రి వమిన్‌షర్రి ఫిత్నతిల్ ఘినా వమిన్‌షర్రి ఫిత్నతిల్ ఫక్రి వమిన్‌షర్రి ఫిత్నతిల్ మసీహిద్దజ్జాలి. అల్లాహుమ్మగ్ సిల్ ఖతాయాయ బిమాయిస్సల్జి వల్‌బర్ది వనఖ్ఖి ఖల్బీ కమా యునఖ్ఖ సౌబుల్ అబ్‌యజు యెనద్దనసి వ బాయిద్ బైనీ వ బైన ఖతాయాయ కమాబాఅత్త బైనల్ మష్రిఖి వల్ మగ్రిబ్."

అనువాదం :- ఓ అల్లాహ్ ! బద్ధకం - సోమరితనం నుండీ అమితమయిన వృద్ధాప్యం నుండీ, అప్పుల భారం నుండీ, అన్నిరకాల పాపాల నుండీ, నేను నీ శరణు వేడుకొంటున్నాను.

ఓ ప్రభూ ! నరకయాతన నుండీ, నరకలోక ఉపద్రవం నుండీ, సమాధి ఉపద్రవం మరియు సమాధియాతన నుండీ, సిరిసంపదల ఉపద్రవపు బారి నుండీ, దారిద్ర్యం, దైన్యావస్థల ఉపద్రవపు బారి నుండీ, దజ్జాల్ ఉపద్రవం నుండీ నేను నీ శరణు పొందుతున్నాను.

ఓ దేవా ! నా పాపాల ప్రభావాన్ని మంచునీటితో కడిగివెయ్యి. ఏ విధంగానయితే తెల్లని వస్త్రం మలినం నుండి శుభ్రపరచబడుతుందో అదే విధంగా నా హృదయాన్ని (చెడు భావాలు, చెడు ఆలోచనల నుండి) కడిగివెయ్యి. తూర్పు పడమరల మధ్య ఎంత దూరం ఉంటుందో అంతే దూరాన్ని నాకు - నా పాపాలకు మధ్య సృష్టించు.

9. "అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మినష్షిఖాఖి వన్నిఫాఖి వ సూయిల్ అఖ్‌లాఖి."

అనువాదం :- ఓ దేవా ! పరస్పర విభేదాల నుండి, కాపట్యం నుండీ, చెడు నడత నుండి నేను నీ శరణు వేడుతున్నాను.

10. "అల్లాహుమ్మ ఇన్నీ అవూజుబిక మిన్‌షర్రి సమ్‌యీ వమిన్‌షర్రి బసరీ వమిన్‌షర్రి లిసానీ వమిన్‌షర్రి ఖల్బీ వమిన్‌షర్రి మనియ్యీ".

అనువాదం :- ఓ దేవా !

నా చెవుల బారి నుండి,
నా దృష్టి బారి నుండి,
నా నాలుక బారి నుండి,
నా మనసు బారి నుండి,
నా మనోవాంఛల బారి నుండి -
నీ శరణు వేడుతున్నాను.

11. ఇంకా, ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండాలి.

"అల్లాహుమ్మ అన్త రబ్బీ లా యిలాహ ఇల్లా అన్త ఖలఖ్తనీ వ అనా అబ్దుక వ అనా అలా అహ్దిక వ వాఒదిక మస్తతాతు-అవూజు బిక మిన్షర్రి మా సనఅతు అబూవులక బినీమతిక అలయ్యా వ అబూవు బిజన్బీ ఫగ్ఫిర్లీ ఫ ఇన్నహూ లా యగ్ఫిరుజ్జునూబఇల్లాఅన్త"

అనువాదం.- ఓ అల్లాహ్! నువ్వే నా ప్రభువువి. నువ్వు తప్ప మరో దేవుడు లేడు. నువ్వే నాకు ఉనికిని ప్రసాదించావు. కనుక నేను నీ దాసుణ్ణే. నిన్ను విశ్వసించి, ఆరాధనలు, విధేయతల గురించి నీతో ఏ వాగ్దానమయితే చేశానో ఇంకా ఏ ఒప్పందమయితే కుదుర్చుకున్నానో దానికి సాధ్యమయినంత వరకు కట్టుబడి ఉండటానికి శాయశక్తులా కృషిచేస్తాను. నా వల్ల జరిగే, జరగబోయే తప్పులు, పొరపొచ్చాల నుండీ-వాటివల్ల ఏర్పడే దుష్పరిణామాలనుండీ (ఓ ప్రభూ!) నీ శరణు కోరుతున్నాను. నేను నీ దయానుగ్రహాలను, ఉపకారాలను ఒప్పుకుంటున్నాను. (అలాగే) నా అపరాధాలను, నా లోపాలను కూడా అంగీకరిస్తున్నాను. ఓ నా యజమానీ! నా స్వామీ!! నన్ను క్షమించు. నా పాపాలను తుడిచిపెట్టు. నువ్వు తప్ప పాపాలను మన్నించే వారెవరూ లేరు.

— సమాప్తం —

اَللّٰهُمَّ اجْعَلْنِيْ شَكُوْرًا وَّاجْعَلْنِيْ صَبُوْرًا وَّاجْعَلْنِيْ فِيْ عَيْنِيْ صَغِيْرًا وَّفِيْ اَعْيُنِ النَّاسِ كَبِيْرًا۔

(۴۷) یا یہ دعا پڑھے:۔

اَللّٰهُمَّ اَحْسِنْ عَاقِبَتَنَا فِي الْاُمُوْرِ كُلِّهَا وَاَجِرْنَا مِنْ خِزْيِ الدُّنْيَا وَعَذَابِ الْاٰخِرَةِ۔

(۴۸) یہ دعا بھی بہت ہی مختصر اور بہت جامع ہے:۔

اَللّٰهُمَّ طَهِّرْ قَلْبِيْ مِنَ النِّفَاقِ وَعَمَلِيْ مِنَ الرِّيَاءِ وَلِسَانِيْ مِنَ الْكِذْبِ وَعَيْنِيْ مِنَ الْخِيَانَةِ فَاِنَّكَ تَعْلَمُ خَائِنَةَ الْاَعْيُنِ وَمَا تُخْفِي الصُّدُوْرُ۔

(۴۹) یا یہ دعا پڑھے:۔

قَالَ فَهَلْ تَرَاهُنَّ تَرَكْنَ شَيْئًا۔

(۵۰) دعوات استعاذہ:۔

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُ بِكَ مِنْ جَهْدِ الْبَلَاءِ وَدَرْكِ الشَّقَاءِ وَسُوْءِ الْقَضَاءِ شَمَاتَةِ الْاَعْدَاءِ۔

(۵۱) یہ دعا پڑھے:۔

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُ بِكَ مِنَ الْهَمِّ وَالْحُزْنِ وَالْعَجْزِ وَالْكَسَلِ وَالْجُبْنِ وَالْبُخْلِ وَضَلَعِ الدَّيْنِ وَغَلَبَةِ الرِّجَالِ۔

(۵۲) یا یہ دعا پڑھے:۔

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُ بِكَ مِنَ الْكَسَلِ وَالْهَرَمِ وَالْمَغْرَمِ

(۴۰) میت کو قبر میں رکھنے کی دعا:-

بِسْمِ اللّٰهِ وَعَلٰى سُنَّةِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ۔

(۴۱) زیارتِ قبور کے لئے قبرستان جانے کے وقت کی دعا:-

اَلسَّلَامُ عَلَيْكُمْ اَهْلَ الدِّيَارِ مِنَ الْمُؤْمِنِيْنَ وَالْمُسْلِمِيْنَ وَاِنَّا اِنْ شَآءَ اللّٰهُ بِكُمْ لَلَاحِقُوْنَ، نَسْاَلُ اللّٰهَ لَنَا وَلَكُمُ الْعَافِيَةَ، اَنْتُمْ لَنَا فَرَطٌ وَّنَحْنُ لَكُمْ تَبَعٌ۔

(۴۲) بیت الخلاء میں داخل ہونے کے وقت پڑھنے کی دعا:-

اَللّٰهُمَّ اِنِّيْ اَعُوْذُ بِكَ مِنَ الْخُبُثِ وَالْخَبَائِثِ۔

(۴۳) بازار کی ظلمانی فضاؤں میں اللہ کے ذکر کا غیر معمولی ثواب:-

لَا اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ يُحْيِيْ وَيُمِيْتُ وَهُوَ حَيٌّ لَّا يَمُوْتُ بِيَدِهِ الْخَيْرُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ۔

(۴۴) مباشرت کے وقت کی دعا:-

بِسْمِ اللّٰهِ اَللّٰهُمَّ جَنِّبْنَا الشَّيْطَانَ وَجَنِّبِ الشَّيْطَانَ مَا رَزَقْتَنَا۔

(۴۵) جامع اور ہمہ گیر دعا:-

رَبَّنَا اٰتِنَا فِي الدُّنْيَا حَسَنَةً وَّفِي الْاٰخِرَةِ حَسَنَةً وَّقِنَا عَذَابَ النَّارِ۔

(۴۶) یا یہ دعا پڑھے:-

(۳۵) کسی ناپسندیدہ چیز کے دیکھنے کے وقت کی دعا :-

اَلْحَمْدُ لِلّٰہِ عَلٰی کُلِّ حَالٍ ۔

(۳۶) کسی مریض کی عیادت (مزاج پرسی) کے وقت کی دعا :-

لَا بَأْسَ طَھُوْرٌ اِنْ شَاءَ اللّٰہُ، لَا بَأْسَ طَھُوْرٌ اِنْ شَاءَ اللّٰہُ ۔

(۳۷) جس کا بچہ مرجائے اس کے لئے دعا

جس کا بچہ مرجائے وہ اَلْحَمْدُ لِلّٰہِ عَلٰی کُلِّ حَالٍ اور اِنَّا لِلّٰہِ وَاِنَّآ اِلَیْہِ رَاجِعُوْنَ کہے ۔

(۳۸) دعاء نماز جنازہ :-

نماز جنازہ میں صلوٰۃ وسلام (درود وسلام) پڑھنے کے بعد یہ دعا پڑھے :-

اَللّٰھُمَّ عَبْدُکَ وَابْنُ اَمَتِکَ کَانَ یَشْھَدُ اَنْ لَّآ اِلٰہَ اِلَّآ اَنْتَ وَحْدَکَ لَاشَرِیْکَ لَکَ، وَیَشْھَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُکَ وَرَسُوْلُکَ اَصْبَحَ فَقِیْرًا اِلٰی رَحْمَتِکَ، وَاَصْبَحْتَ غَنِیًّا عَنْ عَذَابِہٖ، تَخَلّٰی مِنَ الدُّنْیَا وَاَھْلِھَا، اِنْ کَانَ زَاکِیًا فَزَکِّہٖ، وَاِنْ کَانَ مُخْطِئًا فَاغْفِرْ لَہٗ اَللّٰھُمَّ لَا تَحْرِمْنَا اَجْرَہٗ وَلَا تُضِلَّنَا بَعْدَہٗ ۔

(۳۹) یا یہ دعا پڑھے :-

اَللّٰھُمَّ اغْفِرْ لِحَیِّنَا وَمَیِّتِنَا، وَصَغِیْرِنَا وَکَبِیْرِنَا، وَذَکَرِنَا وَاُنْثَانَا وَشَاھِدِنَا وَغَائِبِنَا، اَللّٰھُمَّ مَنْ اَحْیَیْتَہٗ مِنَّا فَاَحْیِہٖ عَلَی الْاِسْلَامِ، وَمَنْ تَوَفَّیْتَہٗ مِنَّا فَتَوَفَّہٗ عَلَی الْاِیْمَانِ، اَللّٰھُمَّ لَا تَحْرِمْنَا اَجْرَہٗ وَلَا تُضِلَّنَا بَعْدَہٗ ۔

جب پہلی تاریخ کا چاند دیکھے تو اَللّٰہُ اَکْبَرُ کہے اور یہ دعا پڑھے :-

اَللّٰھُمَّ اَھِلَّہٗ عَلَیْنَا بِالْیُمْنِ وَالْاِیْمَانِ وَالسَّلَامَۃِ وَالْاِسْلَامِ وَالتَّوْفِیْقِ لِمَا تُحِبُّ وَتَرْضٰی رَبِّیْ وَرَبُّکَ اللّٰہُ۔

(۲۸) شب قدر دیکھنے کے وقت :-

اَللّٰھُمَّ اِنَّکَ عَفُوٌّ تُحِبُّ الْعَفْوَ فَاعْفُ عَنِّیْ ۔

(۲۹) جب آئینہ میں اپنا چہرہ دیکھے تو یہ دعا مانگے :-

اَللّٰھُمَّ اَنْتَ حَسَّنْتَ خَلْقِیْ فَحَسِّنْ خُلُقِیْ ۔

(۳۰) چھینکنے کے وقت کی دعا اور چھینکنے والے کو دعا :-

جب چھینک آئے تو یہ کہے :- اَلْحَمْدُ لِلّٰہِ ۔

چھینکنے والے کو (جس نے اَلْحَمْدُ لِلّٰہِ کہا ہو) جواب دے :-

یَرْحَمُکَ اللّٰہُ ۔

(۳۱) خوش خبری سننے اور اس کا شکریہ ادا کرنے کا طریقہ :-

جب کوئی خوش خبری (اچھی خبر) سنے تو کہے :- اَلْحَمْدُ لِلّٰہِ ۔

(۳۲) اپنی یا دوسرے کی ذات یا مال وعیال کی کوئی اچھی بات دیکھنے پر دعا :-

اَللّٰھُمَّ بَارِکْ فِیْہِ ۔

(۳۳) کسی کے اہل و مال کے ایثار کے جواب کا طریقہ :-

بَارَکَ اللّٰہُ فِیْ اَھْلِکَ وَمَالِکَ ۔

(۳۴) کسی پسندیدہ چیز دیکھنے کے وقت کی دعا :-

اَلْحَمْدُ لِلّٰہِ الَّذِیْ بِنِعْمَتِہٖ تَتِمُّ الصَّالِحَاتُ ۔

(۲۲) منیٰ میں قربانی کرنے کے وقت :۔

(۱) اور جب (منیٰ میں) قربانی کرے تو بِسْمِ اللّٰہِ اَللّٰہُ اَکْبَرُ کہے اور جانور کے گلے پر پاؤں رکھکر چھری پھیرے اور یہ نیت کرے :۔

اَللّٰھُمَّ تَقَبَّلْ مِنِّیْ وَمِنْ اُمَّۃِ مُحَمَّدٍ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ

(۲) اور یہ دعا پڑھے اور پھر ذبح کرے :۔

اِنِّیْ وَجَّھْتُ وَجْھِیَ لِلَّذِیْ فَطَرَ السَّمٰوٰتِ وَالْاَرْضَ عَلٰی مِلَّۃِ اِبْرَاھِیْمَ حَنِیْفًا وَّمَا اَنَا مِنَ الْمُشْرِکِیْنَ اِنَّ صَلٰوتِیْ وَنُسُکِیْ وَمَحْیَایَ وَمَمَاتِیْ لِلّٰہِ رَبِّ الْعٰلَمِیْنَ لَا شَرِیْکَ لَہٗ وَبِذٰلِکَ اُمِرْتُ وَاَنَا اَوَّلُ الْمُسْلِمِیْنَ اَللّٰھُمَّ مِنْکَ وَلَکَ بِسْمِ اللّٰہِ وَاللّٰہُ اَکْبَرُ۔

(۲۴) کسی بھی غم، اضطراب اور پریشانی پیش آنے کے وقت کی دعا :۔

لَآ اِلٰہَ اِلَّا اللّٰہُ الْعَظِیْمُ الْحَلِیْمُ، لَآ اِلٰہَ اِلَّا اللّٰہُ رَبُّ الْعَرْشِ الْعَظِیْمِ لَآ اِلٰہَ اِلَّا اللّٰہُ رَبُّ السَّمٰوٰتِ وَالْاَرْضِ وَرَبُّ الْعَرْشِ الْکَرِیْمِ

(۲۵) اور یہ دعا بھی (کثرت سے) پڑھا کرے :۔

حَسْبُنَا اللّٰہُ وَنِعْمَ الْوَکِیْلُ۔

یا۔ حَسْبِیَ اللّٰہُ وَنِعْمَ الْوَکِیْلُ۔

(۲۶) بارش کی مضرتوں سے بچنے کی دعا :۔

جب بارش برس رہی ہو تو تین مرتبہ یہ دعا پڑھے :۔

اَللّٰھُمَّ صَیِّبًا نَّافِعًا

(۲۷) پہلی کا چاند دیکھنے کے وقت کی دعا :۔

حدیث شریف میں آیا ہے کہ: اللہ تعالیٰ ایسے بندے سے خوش ہوتے ہیں جو کچھ کھائے تو اَلْحَمْدُ لِلّٰہِ کہے اور پیے تو اَلْحَمْدُ لِلّٰہِ کہے۔

(۲۸) کھانا کھلانے والوں کے لئے دعا:-

میزبان اور کھانا کھلانے والوں کے لئے یہ دعا کرے:-

اَللّٰھُمَّ بَارِكْ لَھُمْ فِیْمَا رَزَقْتَھُمْ فَاغْفِرْ لَھُمْ وَارْحَمْھُمْ۔

(۲۹) یا یہ دعا کرے:-

اَللّٰھُمَّ اَطْعِمْ مَنْ اَطْعَمَنِیْ وَاسْقِ مَنْ سَقَانِیْ۔

(۳۰) نیا کپڑا پہننے کے وقت کی دعا:-

اگر نیا کپڑا پہنے تو کپڑے کا نام مثلاً عمامہ، قمیص وغیرہ کیلئے یہ دعا مانگے۔

اَلْحَمْدُ لِلّٰہِ الَّذِیْ کَسَانِیْ ھٰذَا وَرَزَقَنِیْہِ مِنْ غَیْرِ حَوْلٍ مِّنِّیْ وَلَا قُوَّۃٍ۔

(۳۰) دولہا اور دلہن کے لئے دعا:-

جس شخص کی شادی ہوئی ہو اس کو یہ دعا دے:-

بَارَكَ اللّٰہُ لَكَ وَبَارَكَ اللّٰہُ عَلَیْكَ وَجَمَعَ بَیْنَكُمَا فِیْ خَیْرٍ۔

(۳۱) مسافر کے لئے سفر میں جانے اور واپس آنے کے وقت پڑھنے کی دعا:-

مسافر جب سواری کی رکاب میں پاؤں رکھے یا سوار ہونے لگے تو کہے:- بِسْمِ اللّٰہِ اور جب اس کی پیٹھ پر بیٹھ جائے یا سوار ہو جائے تو کہے:- اَلْحَمْدُ لِلّٰہِ اور یہ دعا پڑھے:-

سُبْحَانَ الَّذِیْ سَخَّرَ لَنَا ھٰذَا وَمَا کُنَّا لَهٗ مُقْرِنِیْنَ وَاِنَّا اِلٰی رَبِّنَا لَمُنْقَلِبُوْنَ۔

بہتر یہ ہے کہ ادعیۂ ماثورہ (رسول اللہ صلی اللہ علیہ وسلم سے منقول) یا قرآنی دعاؤں میں سے جو دعا حسب حال ہو وہ مانگے اور اس کے بعد یہ تعوذ پڑھے:۔

اَللّٰھُمَّ اِنِّیْ اَعُوْذُ بِکَ مِنْ عَذَابِ جَھَنَّمَ وَمِنْ عَذَابِ الْقَبْرِ وَمِنْ فِتْنَۃِ الْمَحْیَا وَالْمَمَاتِ وَمِنْ شَرِّ فِتْنَۃِ الْمَسِیْحِ الدَّجَّالِ۔

(۲۳) یا یہ دعا پڑھے:۔

اَللّٰھُمَّ اِنِّیْ ظَلَمْتُ نَفْسِیْ ظُلْمًا کَثِیْرًا وَّلَا یَغْفِرُ الذُّنُوْبَ اِلَّا اَنْتَ فَاغْفِرْ لِیْ مَغْفِرَۃً مِّنْ عِنْدِکَ وَارْحَمْنِیْ اِنَّکَ اَنْتَ الْغَفُوْرُ الرَّحِیْمُ۔

(۲۴) عام طور پر کھانا کھانے کے لئے بیٹھنے کے وقت:۔

جب کھانا کھانے بیٹھے تو یہ دعا پڑھے:۔

اَللّٰھُمَّ بَارِکْ لَنَا فِیْہِ وَاَطْعِمْنَا خَیْرًا مِّنْہُ۔

(۲۵) اگر دودھ ہو تو یہ دعا پڑھے:۔

اَللّٰھُمَّ بَارِکْ لَنَا فِیْہِ وَزِدْنَا مِنْہُ۔

(۲۶) کھانا کھانے سے فارغ ہونے کے بعد کی دعا۔

جب کھانا کھاچکے تو یہ دعا پڑھے:۔

اَلْحَمْدُ لِلّٰہِ حَمْدًا کَثِیْرًا طَیِّبًا مُّبَارَکًا فِیْہِ غَیْرَ مَکْفِیٍّ وَّلَا مُوَدَّعٍ وَّلَا مُسْتَغْنًی عَنْہُ رَبَّنَا۔

(۲۷) یا یہ دعا پڑھے:۔

اَلْحَمْدُ لِلّٰہِ الَّذِیْ اَطْعَمَنَا وَسَقَانَا وَجَعَلَنَا مِنَ الْمُسْلِمِیْنَ۔

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ وَلَا إِلٰهَ غَيْرُكَ۔

(۱۹) دونوں سجدوں کے درمیان بیٹھنے کے وقت کی دعا:۔

جب دونوں سجدوں کے درمیان بیٹھے تو یہ دعا مانگے:۔

اَللّٰهُمَّ اغْفِرْ لِيْ وَارْحَمْنِيْ وَعَافِنِيْ وَاهْدِنِيْ وَارْزُقْنِيْ وَاجْبُرْنِيْ وَارْفَعْنِيْ۔

(۲۰) قعدہ میں پڑھنے کی دعا۔ التحیات کا بیان:۔

دو رکعتیں پڑھ کر جب قعدہ میں بیٹھے تو یہ التحیات پڑھے:۔

اَلتَّحِيَّاتُ لِلّٰهِ وَالصَّلَوٰتُ وَالطَّيِّبَاتُ، اَلسَّلَامُ عَلَيْكَ اَيُّهَا النَّبِيُّ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهٗ، اَلسَّلَامُ عَلَيْنَا وَعَلٰى عِبَادِ اللّٰهِ الصَّالِحِيْنَ اَشْهَدُ اَنْ لَّا اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ۔

(۲۱) درود شریف کا بیان:۔

آخری "قعدہ" میں التحیات کے بعد یہ درود پڑھے:۔

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰى اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ۔ اَللّٰهُمَّ بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰى اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ۔

(۲۲) درود شریف کے بعد پڑھنے کی دعائیں:۔

درود شریف کے بعد سلام پھیرنے سے پہلے جو دل چاہے دعا مانگے۔

حدیث میں آیا ہے کہ :۔

(۱) اذان کے انیس ۱۹ کلمے ہیں جن کو سب ہی جانتے پہچانتے ہیں :۔

(۲) صبح کی اذان میں اَلصَّلٰوۃُ خَیْرٌ مِّنَ النَّوْمِ (نماز سونے سے بہتر ہے) دو مرتبہ زیادہ کیا جاتا ہے ۔

(۱۶) جب مؤذن کی اذان سنے تو جو کلمات مؤذن کہتا جائے خود بھی وہی کلمات اذان کہتا جائے :۔

(۱۷) ہاں ۔ حَیَّ عَلَی الصَّلٰوۃِ اور حَیَّ عَلَی الْفَلَاحِ کے بجائے لَاحَوْلَ وَلَا قُوَّۃَ اِلَّا بِاللّٰہِ کہے ۔

(۱۷) اذان ختم ہونے کے بعد اوّل درود شریف پڑھے، پھر حسب ذیل دعاء وسیلہ پڑھے :۔

اَللّٰھُمَّ رَبَّ ھٰذِہِ الدَّعْوَۃِ التَّآمَّۃِ وَالصَّلٰوۃِ الْقَآئِمَۃِ اٰتِ مُحَمَّدَ نِ الْوَسِیْلَۃَ وَالْفَضِیْلَۃَ وَابْعَثْہُ مَقَامًا مَّحْمُوْدَ نِ الَّذِیْ وَعَدْتَّہٗ اِنَّکَ لَا تُخْلِفُ الْمِیْعَادَ ۔

(۱۸) نماز کی دعاؤں کا بیان :۔

جب فرض نماز پڑھنے کے لئے کھڑا ہو تو یہ دعا پڑھے :۔

اِنِّیْ وَجَّھْتُ وَجْھِیَ لِلَّذِیْ فَطَرَ السَّمٰوٰتِ وَالْاَرْضَ حَنِیْفًا وَّمَآ اَنَا مِنَ الْمُشْرِکِیْنَ ، اِنَّ صَلٰوتِیْ وَنُسُکِیْ وَمَحْیَایَ وَمَمَاتِیْ لِلّٰہِ رَبِّ الْعٰلَمِیْنَ ۔

پھر تکبیر کے بعد یہ پڑھے :۔

(۱۰) اور وضو سے فارغ ہو کر آسمان کی طرف نظر اٹھا کے تین مرتبہ یہ دعا پڑھے :-

اَشْهَدُ اَنْ لَّا اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ -

(۱۱) دعائے قنوت :-

اَللّٰهُمَّ اِنَّا نَسْتَعِيْنُكَ وَنَسْتَغْفِرُكَ وَنُثْنِيْ عَلَيْكَ الْخَيْرَ وَنَشْكُرُكَ وَلَا نَكْفُرُكَ وَنَخْلَعُ وَنَتْرُكُ مَنْ يَّفْجُرُكَ اَللّٰهُمَّ اِيَّاكَ نَعْبُدُ وَلَكَ نُصَلِّيْ وَنَسْجُدُ وَاِلَيْكَ نَسْعٰى وَنَحْفِدُ، وَنَخْشٰى عَذَابَكَ وَنَرْجُوْ رَحْمَتَكَ اِنَّ عَذَابَكَ بِالْكُفَّارِ مُلْحِقٌ -

(۱۲) مسجد میں داخل ہونے کے وقت :-

مسجد کے اندر پہونچکر رسول اللہ صلی اللہ علیہ وسلم پر درود پڑھے، اور اس کے بعد کہے :-

اَللّٰهُمَّ افْتَحْ لِيْ اَبْوَابَ رَحْمَتِكَ -

(۱۳) نماز سے فارغ ہو کر مسجد سے نکلنے کے وقت :-

جب نماز سے فارغ ہو کر مسجد سے باہر نکلنے لگے تو رسول اللہ صلی اللہ علیہ وسلم پر درود بھیجے اور کہے :-

اَللّٰهُمَّ اعْصِمْنِيْ مِنَ الشَّيْطَانِ الرَّجِيْمِ -

(۱۴) اور یہ دعا پڑھے :-

اَللّٰهُمَّ اِنِّيْ اَسْئَلُكَ مِنْ فَضْلِكَ -

(۱۵) اذان کے وقت :-

أَنْتَ مَوْلٰـنَا فَانْصُرْنَا عَلَى الْقَوْمِ الْكَافِرِيْنَ ؞

(۴) جب گھر میں داخل ہو یا گھر سے نکلے تو یہ دعا پڑھے اور پھر (گھر والوں کو) سلام کرے :-

اَللّٰهُمَّ اِنِّیْ اَسْئَلُكَ خَيْرَ الْمَوْلِجِ وَخَيْرَ الْمَخْرَجِ، بِسْمِ اللّٰهِ وَلَجْنَا وَبِسْمِ اللّٰهِ خَرَجْنَا، وَعَلَى اللّٰهِ رَبِّنَا تَوَكَّلْنَا ۔

(۵) اور تین مرتبہ یہ استغفار پڑھے :-

اَسْتَغْفِرُ اللّٰهَ الَّذِیْ لَآ اِلٰهَ اِلَّا هُوَ الْحَیُّ الْقَيُّوْمُ وَاَتُوْبُ اِلَيْهِ ۔

(۶) اگر سوتے میں ڈر جائے یا کوئی گھبراہٹ اور پریشانی [illegible] ہو، یا نیند اچٹ جائے تو یہ تعوذ پڑھے :-

اَعُوْذُ بِكَلِمَاتِ اللّٰهِ التَّامَّةِ مِنْ غَضَبِهٖ وَعِقَابِهٖ وَشَرِّ عِبَادِهٖ وَمِنْ هَمَزَاتِ الشَّيَاطِيْنِ وَاَنْ يَّحْضُرُوْنَ ۔

(۷) سو کر اٹھے تو پڑھے :-

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِیْ اَحْيَانَا بَعْدَ مَا اَمَاتَنَا وَاِلَيْهِ النُّشُوْرُ ۔

(۸) بیدار ہوتے ہی یہ دعا پڑھے :-

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ، لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَیْءٍ قَدِيْرٌ، اَلْحَمْدُ لِلّٰهِ وَسُبْحَانَ اللّٰهِ وَلَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاللّٰهُ اَكْبَرُ وَلَا حَوْلَ وَلَا قُوَّةَ اِلَّا بِاللّٰهِ ۔

(۹) جب وضو کرنے بیٹھے تو [illegible] بِسْمِ اللّٰهِ کہے اس کے بعد یہ دعا مانگے ۔

[illegible] فِیْ دَارِیْ وَبَارِكْ لِیْ فِیْ رِزْقِیْ ۔

بسم اللہ الرحمٰن الرحیم

# دعائیں

(۱) اگر کوئی قرض یا کسی اور دنیوی فکر و پریشانی میں گرفتار ہو تو صبح و شام پڑھا کرے:۔

اَللّٰهُمَّ اِنِّیْ اَعُوْذُ بِكَ مِنَ الْهَمِّ وَالْحُزْنِ وَاَعُوْذُ بِكَ مِنَ الْعَجْزِ وَالْكَسَلِ وَاَعُوْذُ بِكَ مِنَ الْجُبْنِ وَالْبُخْلِ وَاَعُوْذُ بِكَ مِنْ غَلَبَةِ الدَّیْنِ وَقَهْرِ الرِّجَالِ۔

(۲) دن میں ستائیس ۲۷ یا پچیس ۲۵ مرتبہ یہ استغفار پڑھے:۔

اَللّٰهُمَّ اغْفِرْ لِیْ وَلِلْمُؤْمِنِیْنَ وَالْمُؤْمِنَاتِ وَالْمُسْلِمِیْنَ وَالْمُسْلِمَاتِ۔

(۳) سورہ بقرہ کی یہ دو آخری آیتیں رات میں کسی وقت بھی ہو پڑھا کرے:۔

(۱) اٰمَنَ الرَّسُوْلُ بِمَآ اُنْزِلَ اِلَیْهِ مِنْ رَّبِّهٖ وَالْمُؤْمِنُوْنَ ط كُلٌّ اٰمَنَ بِاللّٰهِ وَمَلٰٓئِكَتِهٖ وَكُتُبِهٖ وَرُسُلِهٖ قف لَا نُفَرِّقُ بَیْنَ اَحَدٍ مِّنْ رُّسُلِهٖ قف وَقَالُوْا سَمِعْنَا وَاَطَعْنَا غُفْرَانَكَ رَبَّنَا وَاِلَیْكَ الْمَصِیْرُ۔

(۲) لَا یُكَلِّفُ اللّٰهُ نَفْسًا اِلَّا وُسْعَهَا ط لَهَا مَا كَسَبَتْ وَعَلَیْهَا مَا اكْتَسَبَتْ ط رَبَّنَا لَا تُؤَاخِذْنَآ اِنْ نَّسِیْنَآ اَوْ اَخْطَاْنَا ج رَبَّنَا وَلَا تَحْمِلْ عَلَیْنَآ اِصْرًا كَمَا حَمَلْتَهٗ عَلَى الَّذِیْنَ مِنْ قَبْلِنَا ج رَبَّنَا وَلَا تُحَمِّلْنَا مَا لَا طَاقَةَ لَنَا بِهٖ ج وَاعْفُ عَنَّا قف وَاغْفِرْ لَنَا قف وَارْحَمْنَا قف

(۳) تم نے خدا کی نعمت کھائی اور اس کا شکریہ ادا نہ کیا۔

(۴) تم نے بہشت کو پہچانا اور اس کو طلب نہ کیا۔

(۵) تم نے آگ کو پہچانا اور اس سے خوف نہ کھایا۔

(۶) تم نے شیطان کو پہچانا اور اس سے لڑائی نہ کی بلکہ اس کی موافقت کی۔

(۷) تم نے موت کو پہچانا اور اس کے لئے تیاری نہ کی۔

(۸) تم نے زمین کے اندر مردوں کو دفن کئے اور ذرا بھی عبرت حاصل نہ کی۔

(۹) تم نے اپنے عیب تو چھوڑ دیئے اور دوسروں کی عیب جوئی میں مشغول ہوئے۔

تو پھر دعا کیسے قبول ہو گی؟



# دعا کیوں نہیں قبول ہوتی؟



## حضرت محبوب سبحانی قطب ربانی شیخ عبدالقادر جیلانی

## رحمۃ اللہ علیہ

## کے ارشاداتِ عالیہ

آپ نے فرمایا کہ حضرت ابراہیم ادہم رحمۃ اللہ علیہ سے لوگوں نے دریافت کیا کہ ہم لوگ دعا کرتے ہیں، مگر قبول کیوں نہیں ہوتی؟

انہوں نے فرمایا:-

(۱) تم نے حضرت رسول خدا صلی اللہ علیہ وسلم کو پہچانا اور ان کی سُنّت کی پیروی نہ کی۔

(۲) تم نے قرآن کو پہچانا اور اس پر عمل نہ کیا۔

بسم اللہ الرحمٰن الرحیم

# منتخب

# مسنون دعائیں



چند منتخب مسنون دعائیں
جو روزمرّہ کی زندگی سے
تعلق رکھتی ہیں۔

